# శ్రీ జాషువకవిగారి ఖండకావ్యములు

| | | | | |
|---|---|---|---|---|
| ఖండకావ్యము | 1 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 3 వ భాగము | 1 | 0 | 0 |
| గబ్బిలము | 1 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| ఫిరదౌసి | | 1 | 0 | 0 |
| నేతాజీ | | 1 | 0 | 0 |
| బాపూజీ | | 1 | 0 | 0 |
| కాందిశీకుడు | | 1 | 0 | 0 |
| స్వప్నకథ | | 1 | 0 | 0 |
| ముంటాజమహల్ | | 1 | 0 | 0 |
| స్వయంవరం | | 1 | 0 | 0 |
| తెరచాటు (నాటకం) | | 1 | 8 | 0 |
| చిదాబాయి (నాటకం) | | 1 | 8 | 0 |

# కథానికలు

రచయిత

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు



పబ్లిషర్సు:

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.

# విషయసూచిక



# నా కథ

ప్లాట్‌ఫారంమీద జనం కిటకిటలాడుతూ ఉన్నారు. నేను ఇంకా ముప్ఫై, నలభై, గజాలదూరాన ఉన్నప్పుడే రైలు కూసింది. గడగబా పరుగెత్తికెళ్ళి అందుకొని, ఇంటర్ క్లాసు బండిలో కూర్చున్నాను. రైలు కదులుతూ ఉండంగా ఇంకో పెద్దమనిషి వచ్చి ఎక్కాడు.

ఆయన స్ఫురద్రూపి. ఖద్దరు కట్టుకొన్నాడు. కళ్ళకు లావైన జోడు ఉంది. ఆయన్ను చూస్తే, మనకు కలిగే భావాలు ఏమిటంటే, మొదటిది, ఆయన చాలా పెద్దమనిషి అనీ, రెండోది ఆయన బాగా చదువుకొన్నవాడు అనీ.

వచ్చి కూర్చుని ఆయన ముందు నాలుగువైపులా చూశాడు తనకు కావలసిన వస్తువ ఏదో కనిపించనట్టు. విసుక్కున్నట్లు ముఖం చిట్లించాడు. కాసేపు నావైపు తేరి పారజూచి, ఏదో అసంతృప్తి కలిగినట్లు ముక్కాడు. అసలు ఆయనకు రైలంటేనే ఇష్టంలేనట్లు కనిపించింది.

ఇల్లాగే కాసేపు అవస్థపడి, ఎల్లాగో మనస్సు తృప్తి పరచుకొన్నాడు కాబోలు, పైఉత్తరీయంతో శుభ్రంగా ఉన్న బల్లను దులిపి కూర్చున్నాడు.

కూర్చుని కిటికీ నుంచి బైటికి చూశాడు, లోపల ఏమీచూడాస్సింది లేనట్లుగా. జేబులోనుంచి సిజరుపాకెట్టూ

నిప్పెట్టె తీసి తనకు దగ్గరగా పెట్టుకొని మళ్ళీ కిటికీలోనుంచి చూస్తూ కూర్చున్నాడు.

రైలు పక్క స్టేషనులో ఆగింది. ఈయన కిటికీలో నుంచి ప్లాట్‌ఫారంమీద ఉన్న మనుష్యులవంక కాసేపు చూశాడు. రైలు కదిలింది. ఈయన లేచి నుంచుని, ఉత్తరీయంతో మళ్ళీ బల్లను ఓమారు దులిపి, కూర్చున్నాడు. కాసేపు మళ్ళీ కిటికీలోనుంచి, పరుగెత్తుతున్న చెట్లనూ, టెలిగ్రాపు స్తంభాలనూ చూశాడు. ఎంతసేపని చూస్తాడు? విసుగెత్తింది కాబోలు, తన దగ్గరున్న పుస్తకం ఒకటితీసుకొని, అటుతిప్పి, ఇటుతిప్పి, చివరకు ఒకచోటునుంచి ప్రారంభించి చదువుకోటం మొదలుపెట్టాడు.

ఆయన చదువుతున్నాడన్న మాటేగాని ఆనందంతో చదువుతున్నట్లు మాత్రం కనిపించలేదు. కాస్త చదవటం, విసుక్కోటం. ముఖం చిట్లించటం మళ్ళీ చదవటం ఇదీవరస. మధ్య మధ్యను ఒకసారి నవ్వుకొనేవాడేకాని అదేదో వికారపునవ్వు. వెక్కిరింత నవ్వునూ.

ఆ అవస్థచూస్తే, ఆయనకు ఏమీ తోచక బాధపడుతున్నాడనీ, ఏదో చదువుకొంటూ అయినా ప్రొద్దు పుచ్చుదామంటే, ఆయనకు ఆ పుస్తకం ఏమాత్రం తృప్తినీ, ఆనందాన్ని ఇయ్యటం లేదని నాకు తోచింది.

చివరకు ఆయన నావంక చూశాడు మాట్లాడిద్దామని, కాని మాట్లాడించలేదు. అపరిచయుడితో మాట్లాడటం

మర్యాదకాదని అనుకొనే వాళ్ళలో ఆయన ఒకడై యుం టాడు. ఆయన అవస్థ చూచి నేనే ఆయనను మాట్లాడించ డానికి సాహసించి "తమరు చదువుతున్న పుస్తకం ఏమి టండీ" అని అడిగాను.

ఆయన చప్పరించి కళ్ళు చిట్లించి చాలా నిరుత్సాహం చూపిస్తూ 'ఏదో పిచ్చి పుస్తకం లెండి. తెలుగుపుస్తకాల్లో ఒకటి' అన్నాడు. నేనూ చిరునవ్వు నవ్వి అల్లాంటి పుస్తకాల విషయమై నాకూ అసహ్యమే అన్నట్లు తలఊపాను.

తరువాత ఆయన పుస్తకంలో ఇంకా రెండు పంక్తులు చదివి, తలఎత్తి నావంక చూస్తూ "ఏమిటండి! ఇల్లా వ్రాస్తా రూ? ఇదంతా వాఙ్మయమనే గామోలు వీళ్ళు అనుకోటం" అన్నాడు.

ఆయన ఏమిచదువుతున్నారో, దేన్నిగురించి ఆయన అంత అసంతృప్తిని కనపరుస్తున్నాడో నేను తెలుసుకోకుం డానే ఇల్లా అన్నాను. "అల్లాగేనండి ప్రతివాడూ ఇవుడు రచయిత అయినాడు. భాషా పాండిత్యం కావాలా ఏమన్నా నా!" అంటూ ఆధునిక వాఙ్మయాన్నిగురించి, నాఅసంతృ ప్తిని అంతా వెలిబుచ్చాను,

ఈ మాట వినేసరికి ఆయనముఖం చేటంత అయింది. పుస్తకం ఠపీమని మూసివేసి, బల్లమీదపెట్టి, మోకాలి మీద అరచేత్తో కొట్టుకుంటూ "అదండీ. అదిసంగతి" అని

సరిగ్గా తాను, అనుకొన్న విషయాన్ని నేను గ్రహించినందుకు కాబోలు నన్నొక మహా తెలివైన వాడిక్రింద జమకట్టి, ప్రసన్నవదనంతో ముందుకు జరిగి కూర్చున్నాడు.

నేనూ ఉత్సాహంతో మళ్ళీ ఇల్లాగ అన్నాను. "ఈ మధ్య పదేళ్ళనుంచీ పుస్తకరచన మరీ ఎక్కువైందండి. వాడుక భాషలో రచనలు ఉండాలని ఎప్పుడైతే పుట్టిందో, అప్పటినుంచీ, ఈ రకపు వ్రాతలు మహా ఎక్కువైనాయండి?

మాంచి బంగారపు తీగలాగ సాగిన నామాటలధోరణికి, నేనేసంతోషిస్తూ, ఆయనముఖంవంక ఆశగాచూశాను, ఎంతగా ఆనందిస్తాడో చూద్దామని.

ఆయన నాతో పూర్తిగా ఏకీభవించినట్లు చూస్తూ "అయితే ఒకటండి. వాడుక భాషలో వ్రాయకూడదని నేను అనను. భాషా స్వరూపాన్ని నిర్ణయం చేయుటానికి నాకు తాహతు లేదు. కానీ..." అని ఆ వాక్యం పూర్తిచేయకుండా ఊరుకొన్నాడు. నేనన్నాను, "అయితే, ఏమిటి మీ అసంతృప్తికి కారణం?" "భాష ఎల్లాగు ఉన్నా ఫరవాలేదండి. పుస్తకం ఆనందంకోసం చదువుకొంటాము. ఆ ఆనందం ఇయ్యనపుడు ఆపుస్తకం ఎందుకుచెప్పండి? తగలెయ్యనా?' అన్నాడు. ఆయన చెప్పింది సబబుగానే ఉందని నేను తల ఊపాను.

పైగా ఇలా అన్నాను—"నిజమేనండీ! అవినీతికథలు కూడా వ్రాస్తున్నారు కొంతమంది!" ఆయన ఈ మాటలు

విని ఏమీ సంతోషించక "నీతి, అవినీతి—ఏదో ఉండాలె. పది నీతులన్నా ఉండాలె. పది బూతులన్నా ఉండాలె. ఏవీ లేని వెధవ పుస్తకాలు చూశారూ, చొప్పదంటు నమిలి నట్లు ఉంటాయి. అల్లాంటి పుస్తకాలు ఎందుకు చెప్పండి!" అంటూ ఆయన విసుక్కున్నాడు.

నేను నవ్వి తల వూపుతూ అన్నాను. "నిజమేనండి. మరి ఎందుకో అల్లాగ వ్రాస్తారు. అచ్చువేసే వాళ్ళకైనా శాస్త్ర తెలియవద్దండీ?"

"వాళ్ళదేమి ఉందండీ, ఏదో ఇంత పోగుచేసి అచ్చు వేయకపోతే గడవదు." ఇల్లాగ అంటూ ఆయన మళ్ళీ పుస్తకం వంక చూశాడు ఒక్కనిమిషం. ఇద్దరం మాట్లాడ కుండా ఊరుకొన్నాము. నేను ఆయన ముఖంవంకే చూస్తూ కూర్చున్నాను. ఆయన చదివే పుస్తకం ఏమై ఉంటుందా అని ఆలోచిస్తూ, చూస్తూ ఉండగానే ఆయన పెదవులు విడి వడి ఒక చిరునవ్వు తళుక్కు మన్నది.

ఆయన తలఎత్తి నావంక చూశాడు ఎందుకో. నేను చిరునవ్వునవ్వుతూ ఆయనచూపును ఆహ్వానించాను. ఆయన 'చూడండి' అని నన్నుపిలిచి "ఈ పుస్తకంలో చూశారూ, ఒక కథ లెండి. ఈయన ప్రొద్దున్నే లేచి కాలకృత్యాలు తీర్చు కొన్నాట్టండి!"

'అబ్బా, ఎంతపని చేశాడండి!' అని నేను అన్నాను వెక్కిరింతగా.

'ఉండండి. ఇంకా వినాల్సిన విషయం చాలాఉంది. ఆయన భార్య అంతకుపూర్వమే లేచిందట!''

''చాలా తమాషా అయిన విషయమే వ్రాస్తున్నాడు.' అన్నాను నేను. ఆయన విరగబడి నవ్వాడు. నేనూ నవ్వాను'

''ఇల్లాగ నడుస్తుందండీ కథ. చివరసంగతి ఏమిటంటే భార్య కాఫీ ఇస్తుంది. ఈయన తాగుతాడు—ఇదండీ కథ చూశారా.'' అని ఆయన విరగబడి నవ్వాడు. ఏదో పిచ్చి వ్రాతలు' అంటూ నేనూ నవ్వాను.

ఆ తరవాత మరో రెండు నిమిషాలు ఆయన ఇంకో కథ కాబోలు మొదలుపెట్టి చదివాడు. మళ్ళీ ఏమి తమాషాలు చెబుతాడో అని నేను ఆయనవంకే చూస్తున్నాను. మళ్ళీ నవ్వుతూ ''ఆయన భార్య ఆయనకు ఎదురుగా నుంచున్నదట'' అని పుస్తకంలోని విషయాన్ని నాకుచెప్పి నివ్వెరపోయి నావంకచూశాడు అంతి ఛండాలపు పని ఇంకోవాటి లేనట్లు.

నే నేమీ మాట్లాడకపోవటం మూలాన ఆయన మళ్ళీ ఇల్లాగ అన్నాడు. ''భార్య ఇల్లాగ నిలబడి, ఇవ్వాళ ఇంట్లో మెంతులూ, ఆముదం లేవని చెప్పిందటచూశారా-''అన్నాడు.

నేను నవ్వి ఊరుకొన్నాను.

ఆయన ఊరుకోక...''ఏమిటండీ ఇది! ఇదేనా కథా రచన! మెంతులుతో ఆముదంతో కథ అల్లుతారండి?'' అని

విసుక్కుంటూ, విచారంగా నవ్వుతూ నా ముఖంవంక చూశాడు నా ఆమోదంకోసం.

ఏమిటో, మనకు అర్థంకావండీ, ఈ వ్రాతలూ! అన్నాను నేను, ఏదో అనకపోతే బాగుండదని!

"ఏమిటో! ఎందుకండీ? ఈ ఆముదం వ్రాయమని ఎవడేడ్చాడండి. జాతికి ఉత్తేజం కలిగించి, రక్తాన్ని ఉడికించేవి ఉన్నాయి చూశారూ, అవీ కథలంటే!"

"నిజం, నిజం, అండీ," అన్నాను నేను ఆదుర్దాగా ఎక్కడ నన్ను తెలివి తక్కువవాడు అనుకొంటాడో ఆయనతో ఏకీభవించక పోతేనని! ఆయనా సంతోషించాడు.

ఆయనకు అంత విసుగూ, అసహ్యమూ కలిగించిన ఆ పుస్తకం ఏమిటా అని నాకు కుతూహలం కలిగి..."ఏమిటండీ ఆ పుస్తకం?" అని అడిగాను.

ఆయన చప్పరించి "ఏదో వెధవ పుస్తకం పోనిద్దురూ" అంటూ పెట్టెసద్దుకొంటున్నాడు. మరి ఎందుకు కొన్నారూ?" అన్నాను నేను ఆశ్చర్యపోతూ.

"మా బావమరిది ఒకడు ఉన్నాడు లెండి. వాడికి కాస్త కవిత్వపు పైత్యంకూడా ఉంది. వాడు చెప్పాడు ఈపుస్తకం ఏదో బాగుంటుందని. పోనీగదా రైలులో కూర్చుని చదువుకో వచ్చునని కొన్నాను" అని విచారంగా పుస్తకం వంక చూశాడు.

అంత పనికిమాలిన పుస్తకం వ్రాసింది ఎవరై ఉంటా రూ అని నాకూ సందేహం కలిగి "ఏవరండీ గ్రంథకర్త?" అన్నాను.

ఆయన ముఖం చిట్లించుకొని, చప్పరించి ఎవరో అన్నాడు...

నా మనస్సులోని సందేహం తీరక నేను ఆయనవంక ఏదో ఇదిగా చూశాను; నేనేదో సందేహిస్తున్నా ననుకొని, ఆయన "నామాటలు బద్ధం అయితే, ఒకకథ చదవండి మీకే తెలుస్తుంది" అంటూ ఆ పుస్తకం నా చేతిలో పెట్టాడు.

చూద్దును గదా అది నేను వ్రాసిన పుస్తకమే. నేను వ్రాసిన పుస్తకాల్లో అదే ఉత్తమమైనది అని నేను అనుకొనే వాడిని. ఇందాకటినుంచీ అన్నమాటలు నాపుస్తకాన్ని గురించే అని తెలిసికొనే సరికి నేను ఎటువంటి అవస్థలో పడ్డానో నే చెప్పలేను. తెల్లపోయి ఊరుకొన్నాను.

నే నేదో అనుమానిస్తున్నానని అనుకొని, ఆయన "చదవండి చదవండి—" అని మళ్ళీ వికారంగా నవ్వాడు.

"ఎందుకు లెండి. అక్కరలేదు. చెప్పారుగా! నిజమే. ఇప్పటి కాలంలో కుక్క గొడుగుల్లాగ, పుస్తకాలు చాలా తయారవుతున్నాయి," అని పుస్తకం మళ్ళీ ఆయనకు అందించాను.

ఆయన నవ్వుతూ పుస్తకం పుచ్చుకొని బల్లమీద విసిరి పారేశాడు, అసహ్యంతో. నా కడుపులో తుపాకిపెట్టి కాల్చినట్లు అయింది. నా బాధ ఆయనకు ఏం తెలుస్తుంది!

అన్నీ సద్దుకొని ఆయన పెట్టెలో పెట్టుకొంటానికి కాబోలు పుస్తకాన్ని చేత్తోఎత్తి పట్టుకొని, నాకు చూపుతూ, "రూపాయండీ, ఈ పుస్తకం ఒక్క రూపాయిపెట్టి కొన్నానండీ!" అన్నాడు. పాపం ఆయన బాధ నేను గ్రహించలేక పోలేదు. ఆయన మళ్ళీ ఓసారి నావంక తిరిగి, "రూపాయి దండుగండీ" అని తన విచారాన్ని స్పష్టంగా తెలియ పర్చాడు.

"నాకిస్తారూ ఆ పుస్తకం, రూపాయీ ఇస్తానూ" అన్నాను నేను. ఆయన నావంక విచిత్రంగా చూస్తూ, తెలిసి కూడా బోల్తాపడుతున్నాడేమూ అని ఆశ్చర్యపోతూ...... "ఓ తీసుకోండి కావాలంటే" అన్నాడు ఆయన.

రూపాయీ ఇచ్చి ఆ పుస్తకం తీసేసు కొన్నాను. ఇంతలో స్టేషను రావటంచేత, ఆయన దిగిపోతూ ఈ ప్రపంచంలో ఇంత తెలివి తక్కువ వాళ్లుకూడా ఉన్నారా అని ఆశ్చర్యపోయినట్లు చూచి, ఓ చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయి నాడు.

---

# తాగిన వాళ్లు

తాగి వీధివెంట తూలుతూ నడుస్తూన్న వాడిని చూ॰ బుద్ధిమంతులు, నీతిపరులు అసహ్యించుకొంటారు. ఆ మనిషి దగ్గరకు పోరు. వాణ్ణి...భ్రష్టుడని, నీచుడని వేలెత్తి చూ. స్తారు. వాడు పతితుడు, పాపి సంఘానికి వేరుపురుగు వాడి సభ్యతా సంఘంలో నిలబడటానికి స్థానంలేదు. వాడు తన కుటుంబానికి ద్రోహంచేస్తున్నాడు. భార్యకూ, బిడ్డలకూ, తిండిపెట్టక మాడుస్తున్నాడు తనకూ తన కుటుంబానికీ, హాని చేసుకొంటున్నాడు. నిజమే అదంతా.

నేను ఈ వ్యాసంవ్రాయటంలో ఉద్దేశం త్రాగుబోతు ప్రవర్తనలో ఉండే తమాషా చూపి, మిమ్ములను నవ్వమని అనటమే! మీరు నవ్వకపోయినా, మీకు నవ్వు రాక పోయినా, నేను ఏమీ చెయ్యలేను. కాకపోతే కొంచెము విచారపడతాను.

తాగిన సామాన్య మానవుని అసంబద్ధ ప్రలాపనలో నవ్వుపుట్టించే విషయము అంతగా లేదు. అల్లాటి వాడు బూతులు మాట్లాడుతాడు. ఏవో ఒళ్ళు తెలియని మాటలు మాట్లాడుతాడు.

శాస్త్ర చదువుకొని, సంస్కారంకలిగిన మనిషి తాగిన తరువాత అతని ప్రవర్తన, ఒక వింతగా ఉంటుంది.

శాస్త్ర సంస్కారంగల మనిషి తాగినా బూతులు మాట్లాడి అసభ్యంగా ప్రవర్తించడు కాని అతనికి ఒళ్ళు తెలియకపోవటమూ విచిత్రంగా ప్రవర్తించటమూ తప్పదు.

ఒక నాగరికుడే త్రాగి వీధివెంట నడుస్తున్నాడు. అతను సరియైన దారిని నడువక, మురుగు కాలవ ప్రక్కగా నడుస్తున్నాడు. ఒక కాలు కాల్వగట్టుపై పెట్టి రెండవ కాలు కాలువలో పెట్టి నడక సాగిస్తున్నాడు. ఒక కాలు ఎత్తున మరొక కాలు పల్లంలోనూ ఉంటే నడక ఎల్లాగ ఉంటుందో ఊహించుకోవచ్చు. ఒక పోలీసు ఉద్యోగి ఈ మనిషి విచిత్ర ప్రవర్తనను చూచి, ఏమయ్యా, అల్లాగ నడుస్తున్నావేం? అని అడిగాడు.

ఈ పెద్దమనిషి తెల్లపోయిచూచి ఏమీ తెలియని వాడిలాగ, ఏం. ఎల్లాగ నడుస్తున్నాను, అన్నాడు.

అదేమిటయ్యా, ఒక కాలు గట్టుపైన పెడితివి! ఇంకో కాలు కాలువలో పెడితివి! అల్లాగ ఎవరైనా నడుస్తారా, అని ఆ అధికారి మందలించాడు:

ఈ తాగిన వ్యక్తి చటుక్కున రెండుకాళ్లూ గటుపైకి లాగి, సరిగ్గా నిలుచుని, నమస్కరించి ఇల్లా అన్నాడు:

'కృతజ్ఞుణ్ణి బాబూ, ఇందాకటినుంచీ ఆలోచిస్తున్నాను. ఏమిట్రా బాబూ, ఒక కాలు పొడుగుగానూ, ఒక కాలు పొట్టిగానూ ఉన్నదేమా అని. నీవు ఈ సంగతి నాకు సకాలంలో చెప్పావు కాబట్టి సరిపోయింది లేకపోయినట్టయితే, ఆసుపత్రికి

వెళ్ళి ఈ కాలు కాస్త తెగగొట్టించుకోవలెనని ఆలోచిస్తు న్నాను. అంతపనీ జరిగిపోయేది.'

తాగినవాళ్ళ ప్రవర్తన సామాన్య మానవ ప్రవృత్తి నకు భిన్నంగా ఉంటుంది. కాబట్టి హాస్యాస్పదంగా ఉంటుంది. ఒక పెద్దమనిషి బాగా తాగి ఏదో ఊరుకు పోవాలని రైలు స్టేషనుకు పోయినాడు. టిక్కెటు కొనుక్కోవాలె కిటికీ వద్దకు పోయి, ఒక టిక్కెట్టు ఇయ్యండి అని అడిగాడు. అవతలి పెద్ద మనిషి ఎక్కడికి ? అన్నాడు. ఎక్కడికి వెళ్ళాలని అను కొన్నాడో ఇతనికి జ్ఞాపకం రాలేదు. అందుకని చాలుక్కువ తెలివిగా అడిగాడు.

ఈ రైలుమీద స్టేషనులు ఏమేమి ఉన్నయ్యో కాస్త చెప్పండి, అని.

మరో ఆయన ఒళ్ళు తెలియని స్థితిలో వీధివెంట నడుస్తూ, తూలుతూవస్తూ మరొక సహోదరుని గట్టిగా కౌగ లించుకొని, అన్నా, కలిసి ఉంటే నిలబడుతాము, విడి పోయామా, ఒరిగిపోతాడు, (United we stand, Divided we fall) అని నీతిబోధ చేశాడు.

ఒక రోజున బాగా తాగిన ముగ్గురు పెద్దమనుష్యులు జట్కాబండిలో వెడుతున్నారు. వారు ముగ్గురూ కూడా ఆనందంలో పరవశత చెందియున్నారు. వీధిమలుపులో ఒక చోట బండి ఆగిపోయింది.

ఆ జట్కా గుఱ్ఱానికి ఏదో పెంకెబుద్ధి పుట్టింది. యజమాని గుఱ్ఱాన్ని ప్రీతివాక్యాలతో బ్రతిమిలాడినాడు పెద్దమనుష్యులు బండిలో కూర్చున్నారు. పెంకెతనం చెయ్యక, బండి లాగవలసింది అని కోరినాడు. అప్పటికి లాభం లేకపోవటం చేత అతడు కొరడాతో దానిని మందలించి చూశాడు. చివరకు గట్టిగా బాదాడు. కాని ఆ గుఱ్ఱము యజమాని మాటలను పెడచెవిని బెట్టి అంతటితో ఊరుకోక, తన ఆత్మగౌరవానికి భంగకరమైన మాటలు అన్నందుకు, అతనిపై క్రోధము వహించి వెనక కాళ్ళు రెండూ, పైకెత్తి తన్నటం సాగించింది. లోపలఉన్న పెద్దమనుష్యులు ఈ దృశ్యాన్ని చూచి పకపకా నవ్వారు. జట్కా గుఱ్ఱానికీ చాలకోపం వచ్చింది. తనను జూచి హేళనగా నవ్విన మానవులను తన బండిలోనుంచి బైటకు వెళ్ళిపొండి అని గుఱ్ఱపు భాషలో గట్టిగా చెప్పి సకిలించింది. వాళ్లు వినక ఇంకా ఎక్కువగా నవ్వారు.

అప్పుడు, ఇక అవమానాన్ని భరించలేక, తన శక్తినంతా వినియోగించి ఆ ముగ్గురు మనుష్యులూ, బండిలోనుంచి బయటకు జారిపడేలాగున చేసి విజయ సూచకంగా సకిలించింది:

ముగ్గురూ నేలకూలారు. లేవటానికి శక్తి లేదు. వెల్లకిలా పడిఉన్నారు. అందులో ఒక పండితుడు కొంచెం శ్రమ

పడి లేచికూర్చున్నాడు. జనం మూగింది. అతనికి చాలా సంతోషం కలిగింది. తాను రాజుననుకొన్నాను. ప్రజలంతా తన దర్శనార్థము గుమికూడినారని తోచింది.

'ధర సింహాసనమై' అన్నాడు గర్వంగా నలుదిక్కులా చూస్తూ.

వెంటనే రొండోఆయన లేవలేని స్థితిలో వెల్లకిలా పడుకొని, 'నభంబు గొడుగై' అని ఆకాశంవంక చూశాడు.

మూడవపండితుడు 'తద్దేవతల్ భృత్యులై' ఆ జనం వంక చూపిస్తూ.

అంతా నవ్వారు.

ఇంతలో గుఱ్ఱపుబండివాడు వాళ్ళతో బండి ఎక్కండి అయ్యా, అని కోరాడు.

వాళ్ళంతాకూడా ఎక్కటానికి నిరాకరించి 'ఎక్కిన బారని గుఱ్ఱము గ్రక్కున విడువంగ వలయు'—అని ఏక గ్రీవంగా ఉద్ఘాటించి మరో బండిలో ఎక్కి వెళ్ళిపోయినారు.

తాగేవాళ్ళ మనఃస్థితినిగురించి విచారిస్తే ఒకటిరెండు తమాషాలు కనపడతవి! తాగినవాడు ఎప్పుడూ తాను తాగినట్లు ఒప్పుకోడు. ఏదో కాస్త పుచ్చుకొన్నా తనకు ఒళ్లు తెలియనిస్థితి ఎప్పుడూ రాదని గట్టి నమ్మకం.

తాను బాగా తాగినా చక్కగా తెలివితేటలతో మామూలు మనిషిలాగ మాట్లాడగలడనీ, ఇతరులు తాను తాగినట్లు చస్తే కనుక్కోలేరని అనుకొంటాడు.

తీరా బాగా తాగిన తరువాత కాస్త అనుమానం కలుగుతుంది. ప్రపంచం తాను తాగినట్లు తెలుసుకొన్నదేమోనని. ఈ అనుమానం అతనిని చాలా బాధపెడుతుంది. తన రహస్యం ప్రపంచానికి తెలియకూడదు. ఎల్లాగ తెలియకుండా ఉంచటం. అతడు తన బుద్ధినంతా వినియోగించి ఆలోచిస్తాడు. చివరకు అందరిని మోసపుచ్చటానికి కృతనిశ్చయుడై కనపడ్డ ప్రతివ్యక్తితోనూ అంటాడు: 'నేను తాగానని అనుకొన్నారా, ఏటండి. చట్—నేను అసుమంటోణ్ణి కాదు. బాబూ, కిట్టనోళ్లు లచ్చ సెపుతారు. నేను అసలు తాగనుండి బాబూ' అని అప్పటికే అతనికి ఇంగిత జ్ఞానం పోయి ఉంటుంది.

ఈ త్రాగుడు సృష్ట్యాదినుంచీ వస్తూఉన్న ఆచారమే.

వేదయుగంలో ఆర్యులు సోమపానం చేసేవారు బ్రాహ్మణులుకూడా తాగేవారు.

పురాణాలలో కావలసినన్ని నిదర్శనాలు కనపడతవి. రాజులు తాగేవారిని చూపటానికి అప్పుడప్పుడు స్త్రీలుకూడా

తాగేవారని తోస్తుంది–సుధేష్ణకు శిరోవేదన కలగటమూ, ఆమె, సైరంధ్రిని మదిర తెమ్మని. కీచకుని ఇంటికి సంపటమూ అందరికి తెలిసిన విషయమే!

తాగినవాడికి చాలా ఆనందంగా ఉంటుంది కాసేపు. వాడు ప్రపంచంలోని కష్టాలన్నీ మరిచిపోయి మహానందాన్నం దాన్ని అనుభవిస్తాడు.

దుఃఖభూయిష్ఠమైన ఈ పాడుప్రపంచంలో తాత్కాలికమైనా సరే, గొప్ప ఆనందాన్ని ఇచ్చేది ఈ త్రాగుడే.

---

# ఉత్తరం రావాలె

పోస్టుమాన్ కనిపించటంతోనే ఆదెమ్మ అడిగింది. "ఏం, సూరయ్యా, ఏమైనా ఉత్తరం ఉందా ?"

ఎందుకు అడగటం ? ఉత్తరం వస్తే అతనే ఇచ్చి వెడతాడు. మన యింటిదాకా వచ్చి ఉత్తరం ఇయ్యకుండా ! వెడతాడా? అయినా ఆమెకు అనుమానం !

అతడు చెయ్యి చూపి, పెదవివిరిచి "ఉత్తరాలులేవు" అన్నాడు. ప్రాణం చివుక్కు మన్నది. ఉత్తరం లేకపోవటమేమిటి ?

కూతురు దగ్గరనుంచి ఉత్తరం తప్పకుండా రావాలె. మూడు ఉత్తరాలు వ్రాసింది. ఒక్కదానికీ జబాబు లేకుండా ఉంటుందా ?

ఛా, ఛా! ఎప్పటికీ కాదు. ఇన్నాళ్లు వ్రాయకుండా ఉంటుందా అదెనుటుకు? ఎక్కడో పొరపాటు జరిగి ఉండాలె.

ఈ పోస్టుమాన్ చేతులో ఉత్తరాలకట్ట ఒకటిఉంది. నా కేమైనా ఉత్తరం ఉందా అని ఆదెమ్మ అడిగినప్పుడు ఆ కట్టలిప్పి, వెదికి లేదన్నాడా? అడిగీ అడగటంతోనే లేదు పొమ్మన్నాడు.

"ఇదిగో సూరయ్యా కాస్త చూడు నాయనా! ఉత్తరం ఒకటి అమ్మాయి దగ్గరనుంచి రావాలె ! నిల్లోసుకొన్న పిల్ల! కన్న కడుపుకాదు నాయనా, ఆదుర్దాగా ఉంది !

బాబు గాదూ, కాస్తచూడు. నీకు పుణ్యం ఉంటుంది. సత్తైన పల్లి నాయనా. సత్తైనపల్లి నుంచి వచ్చిన ఉత్తరాల్లో చూద్దూ!'' అని బ్రతిమిలాడింది ఆదెమ్మ.

సూరయ్య పాపం మంచివాడు. కట్ట లిప్పి, ఎక్కడో మధ్యను తెరిచి చూచి చప్పరించి మళ్ళీ ''లేవమ్మా'' అన్నాడు.

ఇంకేం చేస్తుంది నా బొంద! చూచికూడా లేదంటూ ఉండె!

అసలు ఈ ఉత్తరాలు వచ్చే పద్ధతే నానా గొడవ గానూ ఉంది. పూర్వం రోజులలో అయితే, ఉత్తరాలు మనిషిచేతికి ఇచ్చి పంపేవాళ్ళు! మొదట్లోనే నమ్మకం గల మనిషిని చూచుకొని వాడిచేతికి మనం ఉత్తరం స్వయంగా మన చేతులతో ఇచ్చేవాళ్ళం! వాడు మనం ఇచ్చిన ఉత్తరాన్ని తీసుకొని జాగ్రత్తగా మడిచి ఉత్తరీయం కొంగున కట్టుకొని, ఆ ఉత్తరీయాన్ని తలపాగాగా చుట్టేవాడు. వాడి తలగుడ్డలో మన ఉత్తరం సురక్షితంగా ఉండటం మనం కళ్ళారా చూసేవాళ్ళం.

ఆ మనిషితో కూడా మనం ఒకటికి పదిసార్లు చెబుతాము. ''ఉత్తరం జాగ్రత్తరా అబ్బాయి? అల్లుడు గారికిఇయ్యి. ఇంకెవ్వరికీ ఇయ్యకేం? అమ్మాయిగారిని కాస్త రహస్యంగా పలకరించిరా; అత్తగారు ఎట్లా చూస్తున్నాదీ అంతా కనుక్కు రావాలె.'' వాడు మన యింటిమనిషి. నమ్మకస్తుడు. వాడు బయలుదేరి పోతూన్నా,

మనకు ఉత్తరం అంది తీరుతుందని ధైర్యం. మన కళ్ళఎదుట ఉత్తరం పోవటం మనం చూస్తాము. పూర్వకాలం సంగతి అల్లాంటిది.

ఇప్పు డేముంది, ఎంతోఆదుర్దాతో ఉత్తరం వ్రాస్తాము. దాన్ని తీసికెళ్ళి ఆ పోస్టు ఆఫీసులో ఒక బిలంలోకి నెట్టేస్తాము.

ఆ బిలంలోకి నెటితే అది ఏమైపోతుందో ఏమో !!

అదైనా ఒక పెట్టె, బేడా అయితే పోనీ అని సరి పెట్టుకోవచ్చు. ఏమిటో అది! గోడలో ఉంటుందాయె, మంగళగిరి నరసింహస్వామి కబేళంలాగ నోరు తెరుచుకొని. అందులోకి ఉత్తరాలుకొందరువిసిరిపారేస్తారు!కొందరు ధైర్యంగా ఆ నోట్లోకి చెయ్యి పోనిచ్చి, మెల్లగా జార విడుస్తారు. ఎట్లాగయితే నేం, ఆ బిలం, ఎంత పొడుగో, ఎంత లోతో ఎవరు చూశారు. ఆ ఉత్తరంగతి ఏమౌతుందో ? గోవిందా అని అందులో పారేస్తుంటాము, గంగలో పిండా లేసినట్లు వేస్తాము, అవి మన పిత్రు దేవతలకు అందుతవి అని నమ్మకం. అట్లాగే ఈ ఉత్తరాలు అందుతవి అని నమ్మకం.

ఆ ఉత్తరాలు ఊరూరుకు పోవలసినవి తీసి ప్రత్యేకంగా కట్టలు కట్టి రైల్లో పడేస్తారనీ, అక్కడి వాళ్లు ఈ కట్టలను, జాగ్రత్తచేసి, ఏవూరికట్ట ఆ వూళ్ళో పడేస్తా రనీ, పుకార్లు చాలాఉన్నాయి, కాని ఏమిటో, ఏది ఎంతవరకు నిజమో ఎవ్వరూ చెప్పలేరు.

పోనీ మనం వేసే ఉత్తరా లన్నీ ఒక పెట్టెలోనే పోత య్యా అనుకోందాం, అయితే మటుకు ఏమైనట్టు! మనం వేసే ఉత్తరం ఈ గొట్టం అంచులకు అతుక్కు పోయి, ఆపెట్టెలో పడకపోవచ్చు. అందుకనే కొందరు ఆ గొట్టాన్ని అటూ ఇటూ ఊగిస్తారు. కొందరు గొంతులోకి చెయ్యి పోనిచ్చి నడతారు.

ఇంతా కష్టపడి ఉత్తరాన్ని ఎట్లాగో బలవంతాన నెట్టాము అనుకోండి. ఆ పోస్టుమాస్టరుగారు ఆ ఉత్తరాన్ని సరిగ్గా చూచి ఏవూరు పోవాలో ఆవూరు సంచిలో వెయ్యాలె గదా! ఆయన మటుకు ఎన్నని చూస్తాడు. విసుగు పుట్టి ఏ సంచిలోనో ఒక సంచిలో పారేస్తాడు. దాంతో గోవిందా!

అందుకనే ఉత్తరం పోస్టు చేసినప్పుడల్లా ఆదెమ్మ లోపలికి పోయి, ఆయనను నమస్కారంచేసి, 'బాబూ మా ఉత్తరం ఒకటి అందులో పడేశానండి. దయయుంచి మీరు దాన్ని జాగ్రత్తగా పంపించాలె, అని మనవి చేసుకోం టూ ఉండేది!

కూతురుతో కూడా ఆ మాటే చెప్పింది. అందుకనే ఆ వూళ్ళో పోస్టుమాస్టరు ఉత్తరాలు జాగ్రత్తగా పంపుతూ ఉంటాడు.

ఉత్తరం వ్రాయించి దాన్ని తీసుకెళ్ళి పోస్టుమాస్టరుకే ఇస్తుంది ఆ అమ్మాయి. ఆయన శాస్త్ర తెలిసినవాడు.

ఆయనకూడా ఆ అమ్మాయితో అంటాడట. "అమ్మకు ఉత్తరం వ్రాశావా తల్లీ! ఇల్లాయియ్యిఅమ్మా నేను జాగ్రత్తగా పంపుతాను."

ఆ అమ్మాయి అంత జాగ్రత్తగా పంపుతుంది ఇక్కడే ఈ పోస్టు ఆఫీసులోనే ఏదో మిస్టీకు జరుగుతుంది. లేకపోతే ఎందుకు ఉత్తరం రాదూ? ఇది పెద్ద బస్తీ అయె... ఎన్నో ఉత్తరాలు వస్తాయి. కాస్తపలుకుబడి ఉన్నవాళ్ళవి, షాహుకార్లవి, గవర్నమెంటు ఆఫీసర్లవి చటుక్కున్న పంపేస్తారు! కొంతమంది అక్కడికే వెళ్ళి అడిగి, పట్టుకు, ఉత్తరాలు తెచ్చుకొంటారు!

ఆదెమ్మ బోటి దానికి ఎవరిస్తారు నాయనా! పోస్టుమేష్టరు గారికి ఆమె పేరు తెలియదు. ఉత్తరం వచ్చినా, ఆ పోస్టు ఆఫీసులో ఏబల్లక్రిందో పడి ఉంటుంది. ఎవరూ చూసి ఉండరు. ఎవరికి పట్టింది! ఈ బీదదాని పేరు ఎవరికి తెలుస్తుంది! అందుకనే ఆదెమ్మ ఇల్లా అన్నది.

"సూరయ్యా, అమ్మాయి నాకు ఉత్తరం తప్పకుండా, వ్రాసే ఉంటుందయ్యా. అది ఇన్నాళ్ళు వ్రాయకుండా ఊరుకొనే మనిషి కాదు. అది ఆ ఆఫీసులో ఏమూలో పడి ఉంటుంది. నేను స్వయంగా వెతుక్కుంటాను, ఆఫీసులో మా అమ్మాయి వ్రాసినఉత్తరం, నాకుఇట్టె తెలుస్తుంది! మీకంటే కష్టంగాని! అమ్మాయి దస్తూరి నాకు గుర్తేగా నాయనా! ఏం, బాబు నీతో వచ్చి వెతుకొక్కమంటావా?" సూరయ్య ఇలా

అన్నాడు–"పోస్టు ఆఫీసుకు నీవు ఆడదానివి ఎందుకు వెళ్తావు అక్కా! ఏమీ అక్కర లేదు. నేను వెళ్ళి పోస్టు ఆఫీసు అంతా వెదికి గాలించి వస్తాను. ఉత్తరం వచ్చి ఉంటే, నేనే తెచ్చి ఇచ్చి వెడతాను. నీ వేమీ ఆదుర్దా పడకే."

ఆ దెమ్మ సంతోషించి–"మంచి వాడవు నాయనా తీసుకురా. ఉత్తరం వచ్చే ఉంటుంది" అంటూ కళ్ళ నీళ్ళు తుడుచుకొన్నది.



# కూరల బేరం

కూర ఏదైనా కొనుక్కుందామని బజారు కెళ్ళాను. ఏం కూర కొనేది ?

ఏది చూచినా మండిపోతున్నది. మూడు పావలాలు పెడితే కాని ఒక వీసెడు రాదు ఏ కూర అయినా సరే !

పూర్వం అర్ధపావలా, మహాఅయితే పావలా !

కరువుబత్యంకూడా తగ్గి స్థిరి అధికారులు! ఏం కొనేది!

ఏమీతోచక ఇటూ అటూ తిరుగుతూ జేబులో ఉన్న చిల్లరడబ్బులు లెక్కజూచుకుంటూ కాలం గడుపుతున్నాను.

చిన్నప్పుడు ఒక కథ చదివాను ఒక డబ్బుల సంచిని గురించి, ఆ సంచీ తెరిచినప్పుడల్లా అందులో ఒక శతమానం కనపడేదని. అల్లాంటిది ఒకటి మనకు ఎవరైనా ఇస్తే బాగుండు.

బంగారు నాణాలు ఇచ్చేదే కావాలని నే నేమీ, ఏడవటంలేదు. తెరిచినప్పుడల్లా ఒక పావలా ఇస్తే చాలు. అది ఆశాపాతంగా ఉందంటే, అది అక్కరలేదు. రోజుకు కూరకు సరిపోయే డబ్బులు అందులో కనపడితే చాలు.

అంత ఇబ్బందిగా ఉన్నది ఈ రోజుల్లో !

ఇంతలో ఒక కొట్టు ఆసామీ 'వంకాయ మూడు అణాలు' అని కేక వేశాడు.

అందరూ వంకాయలు వీసె పదిఅణాల చొప్పున అమ్ముతూ ఉంటే ఈ అబ్బాయి మూడు అణాలకే ఎందుకిస్తాడు.

అవేవో పుచ్చు వంకాయలు అయిఉంటై. పోనీ పుచ్చులు తీసివేసి వండుకోవచ్చు. పోయి కొనుక్కుందామనుకొన్నాను.

ఆ కొట్టుదగ్గరకు వెళ్ళి అన్నాను

వీసె ఎంత అన్నావూ ?

ముప్పావలాఅండీ పంతులుగారూ!

ముప్పావలా ? మరి మూడు అణాలేనని కేకవేస్తివి ?

మూడు అణాలు అంటే——సవాశేరు మూడుఅణాలు!

వీసె మూడు అణాలకు ఏ తలకు మాసినవాడు ఇస్తాడండీ పంతులుగారూ ? మీకు ఇంతమాత్రం తెలియదేమండి? అన్నాడు.

ఇదివరలో మా ఆవిడ అనేది నాకు ఏమీ తెలియదని!

ఈ మధ్య మా అమ్మాయికూడా అన్నది. ఇంకేం, వీడుకూడా అన్నాడు. ఇంతమంది తెలిసినవాళ్లు ఉన్న ప్రపంచంలో నేను ఒక్కణ్ణే తెలియని వాణ్ణిలాగ ఉంది !

అతను అల్లా అన్నా నేనేమీ మాట్లాడక ఒక చిరునవ్వు నవ్వాను. ఒక వీసె తూస్తానండీ అన్నాడు.

వద్దు అన్నట్టు తల తిప్పి, ఒక పావలా అతని చేతిలో పెట్టి సవాశేరూ తూచమన్నాను.

సరిగ్గా పావలాకు వేస్తాను అన్నాడు.

నేను విసుక్కొని సవాశేరు ఇయ్యవయ్యా అన్నాను.

అతడు నావంక ఒక చూపు చూశాడు.

వెధవ సవాశేరు వంకాయలకోసమేనా, ఇంత బేరం చేశావు. ఒక్క పావలా వంకాయలు కొంటే లేవు ఎందుకయ్యా ఈ మాత్రానికి ఒక పెద్ద సంచీ పుచ్చుకొని బజారుకు వచ్చావు ? అన్నట్లు అనిపించింది.

నన్ను వంకాయలు ఏరనివ్వలేదు. నేను వేరే బేరం చేసుకోవాలెనండీ, మీరు అరగంటసేపు ఏరుతూ కూర్చుంటే నేను త్రాసుబట్టుకొని కూర్చుంటానా ? పట్టండి అని తనకు ఇష్టమొచ్చిన కాయలు తక్కెడలో వేసి తూచాడు. అవన్నీ పుచ్చులో, గట్టిగా రాళ్ళలాగ ఉన్నవో మెత్తగా ఉన్నవో భగవంతుడికే తెలియాలె. తొందరపెట్టి ఆ కాయలు నా సంచిలో కుమ్మరించాడు.

ఆ తరువాత ఆ పక్క కొట్లో చేమదుంపలు కొందామని వెళ్ళాను. సవాశేరు అర్ధపావలా అని కేక వేస్తున్నాడు.

నేను వెళ్ళి వీసె ఎంతకిస్తావని అడిగేసరికి వాడికి పుట్టెడు కోపంవచ్చింది. నావంక చురచురా చూచి "సవాశేరు బేడా అయితే, వీసె ఎంతో మీకు తెలియదా అండి" అని విసుక్కున్నాడు. నేను తెలియక అడిగానా? వీసెకొంటే ఏమైనా తక్కువకు ఇస్తాడేమోనని నా ఆశ.

అతను అంత అమర్యాదగా మాట్లాడితే నాకు అస హ్యం వేసింది. వెంటనే ఇంకో దుకాణానికి వెళ్ళిపోయినాను.

అక్కడికెళ్ళి, ఏమయ్యా చేమదుంపలు ఎల్లాగిస్తావు?" అన్నాను. 'తమకు తెలియందేముందండి' పంతులుగారూ, అన్నాడు.

వీడు ఒక్కడు నాకు ఏదో శాస్త్ర తెలుసునని ఒప్పు కొన్నాడు. వీడు శాస్త్ర బుద్ధిమంతుడు అని అనుకొని ఒక అర అరవీసెడు దుంపలు తూచమన్నాను. నేను ఏరుకున్న దాకా ఆగలేదు. గబగబ తూచి నాసంచీలో పోశాడు.

అదేమిటయ్యా ఏరుకోనియ్యవూ? అంటే, తమకు తెలియందేముందండీ బాబూ, మీఒక్కరితోనే కూర్చుంటే ఎల్లాగండీ అన్నాడు.

నాకు ఏదో కొంత తెలుసునంటున్నాడు కాబట్టి నేను సంతోషించి ఊరుకొన్నాను. అవతల కొట్లో చామదుంపలు ఎనిమిది అణాలకు బేరం చేసే వస్తిని. అందుకని అరవీసెకు నాలుగు అణాలు చేతులో పెట్టాను. ఆతనికి చాలాకోపం వచ్చింది. దిగమ్రింగాడు. "ఇదేమిటండీ పంతులుగారూ, మీకు తెలియనిదేముంది. వీసెపన్నెండు అణాలు!" అన్నాడు. ఇంకా బేరంచేస్తే నీకేమీ తెలియదు అంటాడని మొదలు కుండా ఆరుఅణాలు అతని కిచ్చేశాను.

అక్కడనుంచి మరొక కొట్లోకి పోయినాను ఒక అర వీసెడు బీరకాయలు కొందామని!

ఎట్లా ఇస్తావయ్యా అని అడిగాను.

ప్రొద్దుటినుంచీ వీసె మువ్వావలాకు అమ్మాను. ఇప్పు డేముంది! ఆ వున్న కాస్త సగకూ ఏదో కాడికి ఇచ్చేసి సొమ్ము చేసుకోందామనుకోంటు న్నాను. మీ యిష్టం వచ్చి నంత ఇయ్యండి అన్నాడు.

మిగిలిపోయిన సరుకు అన్న మాట!

మిగిలిపోయిన సరకూ అంటే, మీ ఉద్దేశం ముదురు కాయ అనుకొన్నారా? బంగారంలాంటి సరుకు! అనినవ్వాడు.

"అబ్బాయీ, నాకు తెలియక అడుగుతాను, బంగా రంలాటి సరుకు ఎందుకు మిగులుతుందయ్యా? వచ్చినవాడు ప్రతివాడూ మంచికాయలు ఏరుకోంటాడుగదా! మిగిలినవి ముదురుకాయలన్న మాటేగా?"

నేను యిట్లా అనేసరికి అతడు విరుగబడి నవ్వాడు— చేనేదో తెలివితక్కువగా మాట్లాడినట్లు! నవ్వి అన్నాడూ, అదా మీరు అనుకోటం! నాదగ్గరకు వచ్చేవాళ్ళంతా కాస్త గొప్ప ఉద్యోగస్తులు, ఆఫీసర్లు! గొప్పవాళ్ళుకదా అని నేను మంచి లేతకాయలు ఏరి ఇద్దామనిచూస్తే, వాళ్ళు నీవు శెయ్యి వద్దు, మేమే ఏరుకోంటాము" అంటారు. మాంచి ముదురు కాయలన్నీ జాగ్రత్తగా ఏరుకొని పట్టుకుపోతారు. అవి ముదు రుకాయలండీ బాబూ అంటే, వాళ్ళు నమ్మరు. నిజానికి మీ కే తెలుస్తుంది చెప్పండి కూరగాయల నాణెం! అందులో పుట్టి అంగడిలో పెరిగినవాళ్ళకు మాకు తెలియాలె గాని!

ఆ విధంగా ముదురు కాయలన్నీ పోతాయి. సాయింత్రానికల్లా నాదగ్గర లేత వెన్నముద్దల్లాటి కాయలుంటాయి. సాయింత్రం ఎప్పుడన్నారండి. మంచి సరుకు దొరుకుతుంది నాదగ్గర అని చెప్పాడు.

అతడు చెప్పిందాంట్లో అబద్ధం నాకు ఎక్కడా కనపడ లేదు.

వీసెడు కాయలు తూచి నా సంచిలో వేశాడు. ఇదొక్కటి నేను చేసిన మంచిబేరం అని సంతోషించాను.

ఆ తరువాత దోసకాయలు అమ్మే చోటుకు వెళ్ళాను. అందులో చాలాభాగము మెత్తగా ఉన్నయి. మెత్తనికాయలు పనికిరావని మా ఆవిడ నాకు చాలాసార్లు చెప్పింది.

ఏమయ్యా ఇల్లా ఉన్నాయీ? అన్నాను.

అతను అన్నాడు పంతులుగారూ ఇవి జగ్గయ్యపేట నక్కదోసకాయలు. ఈ వానలకు కాస్త మెత్తపడ్డమాట నిజమే. కాని కాస్త ఎండకాస్తే మళ్ళీ ఇవి గట్టిపడి రాళ్ళు అవుతయి.

నిజమేనా ?

నిజంగాక అబద్ధం చెప్పేసదాకా నాకేమి కర్మం చెప్పండి.

అవును వాడికేం కర్మం అబద్ధాలు చెప్పిందాకా అనిపించింది.

అతను మళ్ళీ ఇట్లా అన్నాడు: చూడండి పంతులు గారూ, నామాట విని ఇవి తీసుకుపొండి. రేపు మధ్యాహ్నం

చూడండి ఎట్లాగుంటయో. రాళ్ళు పలుగు రాళ్ళు అయిపోతై,

సరేనని ఒక వీసెడు దోసకాయలు తీసుకొన్నాను.

ఇక ఇంటికి వెడదామని బయలుదేరాను.

దీపాలు–జీతాలు చాలక అవస్థపడుతున్న బడిపంతుళ్ళ ముఖాలలాగ వేడుస్తున్నయి.

ఇంటికి కూరలు తీసికెళ్ళాను. మా ఆవిడ ముందు పోశాను. ఇక వారంరోజులదాకా కూరలు తేనక్కరలేదు, కావలిసినన్ని తెచ్చాను అన్నాను.

ఆవిడ అన్నదీ, మీకో నమస్కారం పెడతా మీరు కూరలు తేబోకండి.

ఏం ?

నా బొంద. ఏం కూరలండీ ఇవ్వి ? బెండకాయలు పెంకులు ! బీరకాయలు—అయ్యో ! ముదురు బొచ్చెలు. వంకాయలు పుచ్చు ? రామ, రామ, మీకు ఇంతమాత్రం తెలియదేమీ అంటా ! ఇన్నాళ్ళు కాపురం చేసినా ఈ మాత్రం తెలియకపోయె. అయ్యో !

నేనేమీ మాట్లాడలేదు.

ఆవిడ మళ్ళీ అన్నది—ఇవేం దోసకాయలు మెత్తపడ్డవి తెచ్చుకొంటారా ?

ఆ మాత్రం తెలియదటండీ—

నేను అన్నాను కోపంగా—ఆ మాత్రం తెలియక కాదు. ఇవి నక్కదోసకాయలు చౌకగా ఇచ్చాడు.

ఇస్తే ఏమి లాభం ! మొత్తబడి కళ్యాణానికి సిద్ధంగా ఉండా !

వానలకు మొత్తబడవు కురి ! కాస్త ఎండ కాసింగా అంటే, అవే రాళ్ళు అవుతవి !

ఆవిడ నవ్వి—అయ్యొయ్యో, ఎవరండీ మీకీ ఈ మాటలు చెప్పింది ! ఎంత టోపీ వేశాడండీ—ఇంత తెలివి తక్కువ మొగుణ్ణి పెట్టుకొని నేను కాపరం చెయ్యలేను బాబూ—అని వెళ్ళి పోయింది.

నాపైన నాకే అసహ్యం వేసింది. కూరలన్నీ తెచ్చిని పెట్టుకొని వస్తిని చచ్చిచెడి కూలి పెడితే పావలా అవుతుం దని, గిల్లి గిల్లి బేరం చేస్తిని ! ఛీ—ఒక్క కూరా అక్కరకు రాకపోయె !

ఇక కూరలు తేకూడదని నిశ్చయించు కొన్నాను.

కాని ఆ దోసకాయలు రేపు మధ్యాహ్నానికి మళ్ళీ గట్టిపడతయ్యనే ఆశ ఇప్పటికీ పోలేదు.

# పదిహేను - పది

బాబూరావును ఇంతవరకు ఎవరూ అర్థం చేసుకోనూ లేదు, చేసుకుంటారని నమ్మకమూ లేదు.

అతను చాలా మంచివాడు. ఒకరికి కష్టం కలిగించే పని ఏదీ చెయ్యకూడదనీ, ఇతరులకు చేతనైన సాహాయ్యం అడగకుండానే చేస్తూవుండాలనీ అతని అభిప్రాయం. కాని ప్రతి విషయంలో ప్రతిచోటా తిట్లుతినటం తప్పటంలేదు.

బజారువెంట వెడుతున్నాడు. అతని పక్కనే పాతికేళ్ళ వయస్సులోవున్న ఒక అమ్మాయి నడుస్తూవున్నది. 'ఎవరా ఈ మనిషీ' అని ఒకసారి చూచి ఆడమనిషీ అని తెలియటంతోనే చటుక్కున తల వంచేసుకున్నాడు. ఎందుకూ ఆ పిల్లవంక చూడటం ? అతనికేంపని ? ఆడపిల్లవంక అల్లాగ చూసే స్వభావం కలవాడై తేకద, బాబు ! తల వంచేసుకొన్నాడంటే తెలియటంలేదూ అతని స్వభావం ఎల్లాంటిదో!

తల వంచుకొని తనదారిని తాను పోతున్నాడు. ఆపిల్ల ఏదో గొణుక్కుంటున్నది—ఏమిటి అంటున్నది ? తననేమైనా అంటున్నదా ? తను ఆ అమ్మాయిని ఏమైనా అంటేగద కోపానికి ?

ఏమి అనుకొంటున్నదో విందామని బాబుకు తోచింది. ఆపిల్ల ఏమనుకొంటే ఏం ? తనదారిని తను పోరాదా అని అంటారు. బాబూ మంచివాడన్నాను గానీ—అతడేమీ

మహాఋషి అని నేను అనలేను. అతనికి రెండు శ్రవణేంద్రియాలు మంచి స్థితిలో వున్నాయి. మనిషికి సహజంగా కలిగే కోరికను అణచుకొనే నిగ్రహశక్తి లేదు. అయితే ఏమైనా పాపిష్టి ఆలోచనలు చేశాడా ? శివ ! శివ ! అల్లాంటి ఆలోచనలు ఏమీ లేవు—ఆపిల్ల ఏమనుకొంటున్నదో విందామని బుద్ధికలిగింది. అంతే ! అల్లాగ బుద్ధికలగటమే మహాపాపం అని అంటే నేను ఏమీ చెప్పలేను. మనలో చాలా మందికి, అల్లాంటి స్థితిలో అల్లాంటిబుద్ధి పుడుతుందని మాత్రం నేను గట్టిగా చెప్పగలను.

అందులో—

బాబు చిన్నవాడు. పాతికేండ్ల కుఱ్ఱవాడు, 'లా' చదువుతున్నాడు. ఇంకా అతను భగవద్గీతా, భజగోవిందం అవీ చదవలేదు. అందుకనే ఆపిల్ల ఏమి గొణుక్కుంటూ వున్నదో తెలుసుకోవలెనని మనస్సులో అనుకొన్నది !

అదీగాక,

అల్లా అనుకోటంకూడా తప్పు అనీ అతడు ఏ 'లా' లోనూ చదవలేదు. పరాశరస్మృతీ, యాజ్ఞవల్క్యస్మృతీకూడా బాబూ చదివాడు ఇంగ్లీషులో. ఇల్లాంటి ఆలోచనలు మనిషికి రాకూడాదనీ, వచ్చినట్లయితే ఆ పురుషుడు రౌరవాది మహానరకాలను పొందుతాడనీ ఎక్కడా లేదుకూడాను.

అట్లా అని ఆపిల్లవాడు, ఆ కుఱ్ఱదానిదగ్గరకు వెళ్ళి, 'ఓ అమ్మాయ్ నీవు ఏమిటి అనుకుంటున్నావు' నన్ను గుఱించి

ఏమైనా అనుకొంటున్నావా ?'—అని అడిగాడా! అడగ లేదు, అతనికి నిగ్రహం కూడా ఉందని చెప్పటానికి నేను సందేహించను. అల్లాగ అడగనూ, లేదు. ఆపిల్ల వంక చూడనూ లేదు. అల్లాగ తలవంచుకొనే కన్నెత్తి చూడకుండా నోరు తెరచి మాట్లాడకుండా ఆ పిల్ల ఏమను కొంటున్నదీ వింటానికి ప్రయత్నించాడు.

చెవులు రెండూ ఆ ఆడమనిషి వైపుకు త్రిప్పి నట్లయితే, కొంత అనుకోవలసిందే మనము! కాని ఆ అబ్బాయి, మామూలు గానే నడుస్తూ మామూలు గానే చూస్తూ, మామూలు గానే వింటూ ఒక చెవిమాత్రమే ఆమె దిక్కునకు పెట్టి విన్నాడు.

నిజంగా బాబు ధీరోదాత్తుడు అనికూడాఅనవచ్చును.

బాబు ఒక చెవితో ఎల్లాగయితే వింటున్నాడో, అల్లాగే ఒక కన్నుతో ఆపిల్లను చూస్తున్నాడూ అనటం కేవలం అన్యాయమేమో! ఆ విషయం చెప్పలేను. నిజం నాకు తెలియదు.

ఆపిల్ల ఎందుకో తనలో తాను నవ్వుకొంటున్నది. అరె! ఆమె దంతాలు ఎంత ధవళంగా ఉన్నాయి, నల్లని ఆకాశంలో తళుక్కున మెరుపు మెరిసినట్లు అయింది. ముఖం అంతాకూడా ధగధగ మెరిసిపోయింది. ఇంత విచిత్రం జరిగినా కూడా బాబూ ఆవిషయం గమనించినట్లు లేదు.

బాబూ తలవంచుకొని ఉన్నాడు. ఆమె ఏమనిగొణుక్కుం

తెలుసుకోవాలెననే ఉత్కంఠ అతనిలో గాఢంగా ఉంది. అంతే అతనిలో స్థాయీ భావము పొందిఉన్నది. దీనికి ఏ విధమైన విభావఅనుభావ సంచారి వ్యభిచారిభావాలు మిళితంకాలేదు.

ఆ పిల్లమాటుకు తనలో తాను అనుకొంటూ నడవటం ఏమిటి ?—అదీ, ఎవ్వరికీ వినపడకుండా వినపడకుండా మాట్లాడుకోటం చూస్తే ఎవరికైనా కష్టంగానే ఉంటుంది. బజారువెంట నడుస్తూ తనలో తాను నవ్వుకోటంకూడా చేస్తే! ఇదేమన్నా ప్రపంచమూ, మహారణ్యమూ! నవ్వుకొంటూ నడుస్తున్న పిల్లనుచూస్తే ఎవరికైనా బుద్ధిపుడుతుంది. 'ఏమే అమ్మాయి ఎందుకు నవ్వుతావూ?' అని అడుగుదామని. ఒక చిరునవ్వు పది చిరునవ్వులను పుట్టిస్తుంది. ఆ ఒక్క అమ్మాయి తనలోతాను ఎందుకో నవ్వుకొంటే, ఆ చుట్టుప్రక్కల ఉన్న పదిమంది పెదవులపైన చిరునవ్వు ఉదయించటమే చాలా విచిత్రమైన విషయంగా తోస్తుందినాకు. ఒకచోట స్విచ్చి నొక్కి లైటు వెలిగిస్తే, పదిలైట్లు వెలిగినట్లు!

ఆ పిల్ల బాబూనుచూచి నవ్విందని నేను అనను. ఆ పిల్లకైనా ఇరవైఅయిదు ఏండ్లకంటె ఎక్కువ లేవు. పాపం అర్థం, శుభం తెలియని బిడ్డ. లోకపు పోకడలు తెలియవు. తాను నవ్వితే ఆ వెలుగు ఎంతలెక్క ప్రసరిస్తుందో, ఎవరి హృదయంలో ఎల్లాంటి భావాలనూ, వికారాలనూ పుట్టిస్తుందో, ఆ అమ్మాయికి తెలియదు. కామసూత్రాలు చదివి ఉంటేగద! చదివి ఉన్నట్లయితే ఇల్లాంటి విషయాలు

తెలిసేవి. మనిషి జాగ్రత్తగా ప్రవర్తించి ఉండేది. అందుకనే కామసూత్రాలు పాఠశాలలలో బోధించవలెనూ అని కొంచెం గోలపెట్టేది!

ఇంతకూ ఆ నవ్వటంకూడా బాబు చూడక, తలవంచుకొని నడుస్తూవున్నాడూ అంటే అతని యోగ్యత ఎల్లాంటిదో తెలుస్తూనే ఉందికదా!

ఆ కుఱ్ఱవాడు అల్లాగ, ఆపిల్ల అనుకుంటూ ఉన్నది ఏమిటా అని చాలాసేపు బాధపడవలసిన అగత్యం లేకపోయింది. అతని అదృష్టంవల్ల ఆ అమ్మాయి తనలోతాను అనుకొంటున్న మాటలు వినిపించినవి.

మరేమీలేదు. ఆపిల్ల ఏదో లెక్కచూచుకొంటూ "పదిన్నీ-పది" అనుకొన్నది. అంతే!

బాబూనుగురించికాదు, ఈతను ఆ అమ్మాయివంక ఒక్కసారి చూశాడని చెప్పాను. అందుకనే ఆపిల్ల తననేదో అంటున్నది అని భ్రమపడ్డాడు. ఇప్పుడు అదేమీ కాదని ఆపిల్ల ఏదో లెక్కచూచుకొంటున్నదీ అని తెలుసుకొన్న తరువాత బాబు మనస్సు కాస్త కుదటబడ్డది.

అయితే పదిన్నీ పది ఎంతో ఆపిల్లకు తెలియక అవస్థ పడుతున్నది. చదువుకొన్నది కాదు అన్నమాట. తెల్లని చీర కట్టుకొని, నల్లని రవిక తొడుక్కొని, తలలో పూలుపెట్టుకొని టీకు-టాకుగా నడుస్తూవుంటే, చదువుకొన్న పిల్లేమో

అని అనుకొన్నాడు కాని, ఇప్పుడు తెలిసి ది ఆపిల్ల ఊహిస్తే డాబు చేస్తున్న దే కాని అసలు సహకు సున్నా అని.

ఈసంగతి గ్రహింపుకువచ్చేసరికి బాబుకు కాస్త నవ్వు వచ్చింది. ఈ పిల్లసంగతి ఇంతేగదా అని! కొద్దిగా నవ్వాడు. మాధురంగానూ, మందంగానూ ఉన్న ఆ చిరునవ్వును స్మితమని అంటారు లాక్షణికులు.

ఇతడు నవ్వటం ఆ అమ్మాయి చూచింది. తనను చూచి ఈ అబ్బాయి నవ్వుతున్నాడని ఆపిల్ల అనుకొన్నది. పాపం, ఆ కుఱ్ఱవాడు ఏపాపమూ ఎరుగడుగదా, అల్లాంటప్పుడు ఆపిల్ల అల్లాగ అనుకోటం ఎంత పొరపాటు! అన్యాయముకూడాను!

ఆపిల్ల అల్లా అనుకొన్నదని బాబుకు తెలియదు. బాబూ ఆలోచన ఇప్పుడుఏమిటా అంటే ఆపిల్లకుపదిన్ని-పది అంటే ఎంతో తెలియలేదే ఎట్లాగా అని!

హిందూదేశంలో స్త్రీలలో ఇంత అజ్ఞానం ఉండటం సిగ్గుచేటు అనీ మనదేశ దౌర్భాగ్యమనీ ఇల్లాగ పెద్దఎత్తు మాటలేమీ అతను అనుకోటంలేదు. హిందూస్త్రీల అజ్ఞానాన్ని పారదోలటానికి కంకణం కట్టుకోవాలె అని అనుకోటమూ లేదు——

కొందరు చిన్న విషయాలలోనుంచి చటుక్కున అల్లాగ భయంకరమైన పెద్ద విషయాల లోకిదూకి ఊరుకొంటారు,

బాబు చాలా శాంతంగా ఆలోచిస్తున్నాడే కాని ఏమాత్రం తొందర పడటంలేదు.

దేశముగొడవ అతనికేమీ పట్టలేదు—ఆ పిల్లకు పదిస్నీ పది ఎంతో ఎట్లాగా తెలియటం అని ఆలోచించాడు. ఆ అంకెలు దేనికన్నా సంబంధించినవి కానీ, చాలా ముఖ్యమైనవిఅయి ఉంటవి. అంటే జీవితంలో ఒక గట్టి సమస్యకు సంబంధించినవి అయి ఉండాలి. లేకపోతే ఆ పిల్ల అంత తీవ్రమైన ఆలోచనలోకి దిగాలిసిన అవసరం ఉండేదికాదు—

పదిస్నీ—పది—కలిస్తే ఎన్నిరోజులు అవుతయ్యో అన్ని రోజులలో ఆమె ప్రియుడు దూరదేశాలనుంచి వస్తాడేమో !

పాపం, ఆవిషయము తల్చుకొనే కామాలు ఆ అమ్మాయి మొదట నవ్వుకొన్నది !

ఇప్పుడు ఆ పిల్ల మొఖంచాలా విచారంగాఉంది. ఏదో అమాయికమైన చూపులు చూస్తున్నది. ఎక్కువగా వ్యాకులత పడుతూ ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తూనేఉంది పదిస్నీ పది ???? పాపం ఇంత చిన్న విషయం తెలియకపోవటం వలన ఎంత పెద్ద వ్యాకులత కలిగింది !!

ఆమె భర్తరాకను గురించో లేక ఆమె తల్లిగారి ఇంటికి వెళ్ళవలసిన మంచిరోజును గురించో ఆమెలెక్కచూస్తూఉండవచ్చు. ఏదైనది బాబుకు తెలియలేదు—కాని తాను, బి. ఏ ప్యాసుఅయి. 'లా' చదువుతూఉన్న వ్యక్తి అక్కడ

ఉండగా, ఒక చిన్నపిల్ల, అసహాయురాలు, అబల, సౌందర్యవతి, మందగమన, కుందరదన, చంచలాక్షి అల్లాగ నిట్టూర్పులు విడుస్తూ, తలవంచుకొని వ్యాకులత పొందుతూ ఉండటం మటుకు బాబు చూడలేక పోయినాడు.

చాలా స్వల్ప విషయం 'పదిన్నీ-పది' అనిపిస్తుంది. కాని మనకేం తెలుస్తుంది ఆ అంకెలు, ఏ స్నిగ్ధహృదయం గల ప్రియాగమనానికి సంబంధించినవో!

బాబూ ఇల్లాగ తలపోయుటంవల్ల ఆ పిల్ల పడుతూవున్న బాధ సంగతి దేమో తెలుసు గాని, ఇతని మనోవ్యథ మటుకు చాలా అధికమైనది.

బాబూ మరొకసారి ఆ పిల్లవంక చూశాడు. ఆపిల్ల కళ్ళవంక చూచి ఆమె పడుతూఉన్న విచారం అంతా తెలుసుకోవచ్చును అని అతని ఉద్దేశం.

ఇన్నిసార్లు చూడాలా ఆ పిల్ల పడుతూవున్న మనోవేదన తెలుసుకోంటానికి! ఒక్కసారి చూస్తే చాలదూ! నిజానికి చాలుకాని బాబూను ఈ ముఖవైఖరి శాస్త్రంలో ఇంకా అనుభవం తక్కువ. ఇల్లాగ మాటిమాటికీ, ఎందుకన్నా గానీ, ఆ పిల్లముఖంకేసి చూడటంవల్ల ఆ పిల్లకు అతణ్ణి చూస్తే చాలా కోపం వస్తూఉన్నది. ఆ కోపమూ, విముఖతా అన్నీ ఆ అమ్మాయి కళ్ళల్లో కనపడుతూనే ఉన్నవి కాని బాబు ఆ చూపులకు ఇంకో అర్థం కల్పించుకొని, పదిన్నీ—పది— ఎంతఅవుతుందో తెలియకపోవటం చేతనే చిరాకుపడి అల్లాగ చూస్తున్నదీ అనుకొన్నాడు——

'లా' చదువుతూవున్న కఱ్ఱవాడు ఈ మాత్రం అర్థం చేసుకోలేకపోయినాడా అంటే నేను ఒప్పుకోను. ఈఆడవాళ్ళ చూపులకు అర్థాలు కల్పించటంలో మహామహావాళ్ళే తల్ల క్రిందులైనారు.

ఇంతకూ అతని ఖర్మంకూడా కలసివచ్చిందో ఏమో అల్లాగ అర్థం చెప్పుకొన్నాడు—

చెప్పుకొని చాలా విచారాన్ని పొందాడు. ఆపిల్ల, పాపం, ఏవిషయాన్నిగూర్చి తెలుసుకోలేక బాధపడుతున్న దో, ఆ విషయం తనకు తెలుసు. అట్లా తెలిసిఉండీకూడా ఆ విషయం చెప్పకపోతే, ఆపిల్ల పొందే మనోవ్యథకు తాను కారణభూతుడు అవుతున్నాడు.

ఒకరు బాధపడటం బాబు చూడలేడు. అందులో నిస్సహాయురాలైన ఒక స్త్రీ ఒక స్వల్ప విషయాన్నిగురించి వ్యాకులత పొందుతూవుంటే తాను సాహాయ్యము చేయగల స్థితిలో ఉండికూడా చేయకపోవటం కేవలమూ క్రౌర్యం అని బాబు మనస్సుకు తోచింది. పాపము, ఆపిల్ల లేత హృదయ ము ఎంతగా పరితపిస్తున్నదో శివ, శివా! అని బాబు వ్యాకు లిత మనస్కుడు అయినాడు.

బాబు క్షణకాలము ఈ విషయమై ఆలోచించాడు. పదిన్నీ—పది ఎంతో చెప్పేస్తే ఆపిల్ల సంతోషిస్తుందిగదా! ఎందుకు ఈ విషయమైన ఇంత ఆలోచన? చెప్పేద్దాము అనే నిశ్చయానికే వచ్చాడు.

ఇంకో విచిత్రం ఏమిటీ అంటే: 'పదిన్నీ—పది' అని ఆపిల్ల అనుకోగా విన్న తరువాత, ఎంతో సేపు కాకముందే ఈ నిశ్చయానికి వచ్చాడు బాబు. అతని ఆలోచనలన్నీ గిర గిరా బహు వేగంతో తిరిగిపోయినవి. వ్రాయటానికి ఇంత ఆలస్యం అయిందిగాని.

ఇంతకూ ఆ కుఱ్ఱవాడు ఆ అమ్మాయి బాధ చూడ లేక పదీ—పది ఎంతో చెప్పివేయటానికే నిశ్చయించాడు. అల్లాగ చెప్పటం, త్రిదోషాలలో ఒకటికాదు అనీ, అందులో తప్పు కించిత్తుకూడా లేదనీ, గట్టిగా నిశ్చయించుకొన్నాడు బాబు.

కేవలం ఒక వ్యక్తికి సంతోషం చేకూర్చాలన్న ఆతు రతతో, పరోపకారబుద్ధితో, బాబు నిర్మల చిత్తంతో, ఆ ఆడపిల్లను కొంచెంగా సమీపించి పరస్త్రీతో మాట్లాడే సమయంలో తాను జూపవలసిన వినయం మొదలుగాగల సముచితమైన మర్యాదలతో, తన వాక్కులో మాధు ర్యాన్ని చొప్పించి, చిరునవ్వుతో అన్నాడు—'పదిన్నీ పది ఇరవయ్యే' అని.

ఆ పిల్ల ఎంతో సంతోషించి బాబూకు కృతజ్ఞత తెలుపవలసినది! కాని ఆమె ముఖంలో సంతోషం లేదు! పెద వులపై చిరునవ్వు లేదు! కృతజ్ఞతా సూచకమైన రచన ఒక్క టీ లేదు ఆమె ముఖంలో!

పైగా,

ఆమె ముఖకమలం ముకుళించుకుపోయింది. కనుబొమ్మలు ముడివడ్డాయి. ఆమె కోపంతో, ముక్కుపుటాలు ఎగురవేస్తూ, కంపిస్తూఉన్న అధరముతో 'నీకెందుకూ?' అన్నది రోషకషాయ నేత్రాలతో.

బాబు ఖిన్నుడైపోయినాడు. తాను చేసిన సాహాయ్యానికి ఇల్లాంటి ప్రతిఫలం వస్తుందని అతడు ఎప్పుడూ ఊహించిఉండడు.

అప్పటికీ అన్నాడు —'పదీ పదీ ఎన్నో తెలియక నీవు గొణుక్కుంటూవుంటే నేను సాయపడ్డానుకాని నిన్నేమీ అనలేదే. ఎందుకు అమ్మాయ్ అంత చిరాకు పడతావూ' అని.

అంటే ఏం లాభం? ఆ పిల్ల ఏమంత మంచి స్వభావం కలది కానట్టుంది. న్యాయం అన్యాయం తెలుసుకొనే శక్తి కూడా ఉన్నట్లులేదు. బాబూను అర్థంచేసుకోలేక నానామాటలూ అన్నది ఇంగ్లీషులో.

ఆ అమ్మాయీ బి. ఏ చదువుతున్నదట! లెక్క తెలియక బాధపడలేదుట! ఊరికేనే అల్లాగ గొణుక్కోటం ఆ పిల్లకు అలవాటుట !!

అయితేమటుకూ !!

తాను తెలివిగలదే కావచ్చు. ఆ కుఱ్ఱవాడు ఆసంగతి తెలియకే పది, పదీ ఇరవై అని చెప్పిఉండవచ్చు. అయితే మటుకు ఇంతలో ఏంప్రమాదం జరిగిందని, ఏమి అకృత్యం,

అత్యాచారం, అసూయిత్వం జరిగిందనీ ఆ పిల్ల అల్లాగ గుంజుకొంటుందో నాకు అర్థంకాలేదు. పైగా అక్కడికి చేరిన నలుగురూ కూడా బాబూనే అన్నారు—'నీకెందుకయ్యా, ఆ పిల్ల నిన్ను అడిగిందా పది పదీ ఎంత అని? తనలో తాను అనుకొంటే నీవు చెప్పటం ఏమిటి?' అని. ఇల్లాగ ఎవరికి తోచినట్లు వారు అందరూ అన్ని విధాల అన్నారు ఆ అన్యాయి పక్షం చేరి!—? ? !

ఇంతకూ,

ప్రపంచం ఇల్లాంటిది! మంచిని అర్థంచేసుకోలేదు. ఖర్మం!—ఇల్లాగ ముక్కచివాట్లు తిని బాబూ తలొంచుకొని ఖిన్నుడై వెళ్ళిపోయినాడు ఆ రోజు—

బాబును ఇంతవరకు ఎవరూ అర్థం చేసుకోనూలేదు. చేసుకొంటారని నమ్మకమూ లేదు.

ప్రాప్తి

# స్వాంతక్రాంతి

మా యిల్లు ఊరిబైట ఉన్నది. బజారుకు చాలా దూరము. బజారుకేమిటి దేనికైనా దూరమే.

శాస్త్ర శొంఠికొమ్ము కావాలంటే మైలుదూరం నడిచి పోయి కొనుక్కోవలసిందే కాని ఈ మధ్య దొరకదు.

పక్కయింటివాళ్ళు ఎవ్వరైనా ఇయ్యాగాలంటే అదేమి ఖర్మమోగాని ప్రక్క ఇళ్ళల్లోనే కాదు, అటు పదీ ఇటుపదీ ఇళ్ళల్లో, మాయింట్లో వేది ఉండదో, వాళ్ళ ఇళ్ళల్లోనూ అదే ఉండదు.

"ఓ గిన్నెడు నెయ్యిఉంటే పోస్తావు అక్కయ్యా" అని వెళుతుంది మా ఆవిడ. ఆ పక్కఇంటి ఆవిడ ముఖం ఇంత జేసుకొని 'అయ్యో, అడక్క అడక్క ఇవ్వాళే అడి గావు! నిన్ననే గిన్నె కాలేశాను అమ్మాయ్, నీవు ఎప్పుడూ అడిగేదానవు కావు. నీవు అడక్క అడక్క అడగటమూ మా యింట్లో లేక పోవటమూనూ! బాగానే ఉంది!' అని దీర్ఘాలుతీస్తూ విచార పడుతుంది.

'నేనైనా అడక్కపోదును అక్కా. కాని ఏమైంది అంటే ఇవ్వాళ ఓ చుట్టము వచ్చాడు. మనమైతే ఎట్లాగైనా సద్దుకుపోతాము. చుట్టానికికూడా వట్టికూడు ఎట్లా పెట్ట సమ్మా! ఏమంటావ్?' అని మా ఆవిడ సంభాషణ

మొదలు పెడుతుంది. కొడుకుకి అయితే ఎలాగైనా, అంటే నెయ్యుడున్నా లేకపోయినా పెట్టవచ్చుననీ పరాయి పెద్దమని షికి అలాగ పెట్టటం చాలా అసహ్యమైనపనిఅనీ, ఆవిడా ఈవిడా కలిసి నిర్ణయిస్తారు.

''రెండు రోజులనుంచి నెత్తిన నోరు పెట్టుకొని అరుస్తుంటే, ఆయన పట్టించుకోండే, నేను ఎలాగ చచ్చేది చెప్పూ? అంటుంది మా ఆవిడ. ఆవిడా సరిగ్గా అలాగే చెపుతుంది ఆ మొకూడా మొత్తుకొంటూనే ఉన్నదట—వాళ్ళ ఆయనకూడా వినటంలేదట'.

సరే దాని తరువాత ఈ మగవాళ్ళేమీ ఇంటి గొడవలు పట్టించుకోకుండా తిరగటాన్ని గురించి కొంత సంభాషణ పెరిగిన తరువాత, 'వెళతా నక్కా ఆయన వచ్చే వేళ అయింది' అంటూ వచ్చేస్తుంది మా ఆవిడ—ఇలాగ ప్రతి విషయంలోనూ అవస్థగా ఉంది.

దీని కేదో ఉపాయం ఆలోచించాలె. ఈ పేటలో ఒక కోమటికొట్టు పెట్టిస్తే బాగుంటుంది ఏది కావలిస్తే అది కొనుక్కోవచ్చు. అనుకొని ఒకణ్ణి బ్రతిమిలాడి పెట్టిస్తే వాడు మూడు నెలలు ఉండి, ఒకరూ కొనలేదనీ, కొన్నవాళ్ళు ఎవ్వరూ ఒక దమ్మిడీ అయినా ఇయ్యలేదని గోలపెట్టి వెళ్ళి పోయినాడు.

ఇల్లు తీసికెళ్ళి నడి బజారులో కట్టుకోముగదా మరి ఏమిటి ఉపాయం ?

ఒకబండి కొనుక్కుంటే అన్ని ఇబ్బందులూ తీరిపోయే లాగున కనిపించింది.

ఏమిటో ఎంతడబ్బు ఖర్చుఅవుతున్నది ? అనేక సార్లు బజారుకెళ్ళి ఏదో ఒక సవాశేరు వంకాయలో, దోసకాయలో, కొని సావలా కూలిపెట్టి తీసుకొస్తున్నాను. ఎండగా ఉంటే ఇంకో పేడ పోతేపోయిందని ఆరు అణాలుఇచ్చి బండెక్కి వచ్చిన రోజులూ ఉన్నవి ! ఇంకా దేముడుచాలా మేలుచేస్తే అనేక రకాలుగా డబ్బు ఖర్చుఅవుతున్నది అనుకోండి. స్కూలుకు రోజు నడిచి పోతూన్నానన్న పేరేగాని ఆ చౌకుదాకా నేగా పోవటం ? అక్కడనుంచి బండెక్కి పోతూనే ఉంటిని ! ఆ చౌకు దాకాఅయినా నడవటం ఎందుకూ అంటే ఇంటావిడ నేను స్కూలుకు మైలుదూరమూ నడిచే వెళుతున్నానని అనుకోటానికి ! వచ్చేటప్పుడు సరే చచ్చినట్లు ఆ మూలనుంచి ఈ మూలకు నడుస్తునే ఉన్నాను.

ఒకబండి కొంటినా ఈ ఖర్చులన్నీ తప్పుతయ్యి.

అయితే ఏ బండి కొనుక్కోవాలె అన్నది ప్రశ్న. జట్కా భరించలేము. గుర్రాన్ని తోమాలె. ఆ పని అంతా ఎవడుచేస్తాడు ? రెండెడ్ల బండి కొనుక్కోంగదా ! ఇక ఎటొచ్చీ ఒంటెద్దు బండి కొనాలె కొనటంఅంటూవస్తే!

మా ఆవిడతో ఈ విషయం ఎత్తితే ఆవిడ ఏమీ అభ్యంతరం చెప్పలేదు.

సరే కొందామా అని గట్టిగా ఆలోచించ సాగాను. కొంటే, బండీ ఎద్దుకూడా మూడు వందల్లో వస్తయ్యి. మనకు కావలసినపుడు ఉపయోగించుకొంటూ అక్కర్లేనపుడు కిరాయికి త్రిప్పితే దానికయ్యేఖర్చు అదే సంపాదించు కొంటుందీ అని మా ఆవిడకు చెప్పాను.

ఆ ఉపాయం ఆవిడ కేమీ నచ్చలేదు. అదేమన్న మాటండీ, ఫల్లాని వారి బండి బాడుగకు తిరుగుతున్నదీ అంటే మనమ కేన్నా మర్యాదగా ఉంటుందా ? ఎబ్బే ! అట్లాంటిపని చేసేకంటే ఊరుకొంటే మేలు అని నిరసనగా అన్నది.

అక్కడికి నేను ఎంతో మర్యాదగా చెప్పాను—ఎద్దును మేపటానికి ఓ పాతిక రూపాయలు చులాగ్గా అవుతయి. ఎటొచ్చీ ఒక మనిషి ఉండాలెగదా, వాడికి అన్నంపెట్టి పది రూపాయలైనా ఇవ్వాలె, మొత్తము ముప్ఫయి ముప్ఫై అయిదు రూపాయలు అవుతవి, అంత పెట్టుకో గలమా ? ఏదో బాడుగకు త్రిప్పితే మనకు అయిన ఖర్చూ వస్తుంది. చేతిలో బండీ ఉంటుంది అని చెప్పాను,

మా ఆవిడకు బండి కిరాయికి త్రిప్పటం ససేమిరా ఇష్టంలేదు. అది అప్రదిష్ట పనిట. ఎవ్వరూ అల్లాగ చేయరట!

'బోలెడుమంది చేస్తారు' అని నేనూ,

'చెయ్యరు' అని ఆవిడా.

కాసేపు పోట్లాడుకొన్నాము. చివరకు తేలిన విషయం ఏమీటాఅంటే ఒంటెద్దుబండిని బాడుగకు త్రిప్పటం అనేది

మర్యాద కాదని నేను ఒప్పుకోవాలిసి వచ్చింది. అయితే ఒకటి కారు అయితే కిరాయికి త్రిప్పినా గౌరవానికి ఏమీ భంగం లేదని ఆమె అంగీకరించింది.

కారుకొంటే మనముదాన్ని భరించ గల్గుతామా అని ! పెట్రోలుకు మరమ్మతులకు మొత్తంమీద కారుకని ఎంత ఖర్చు పెట్టవలసి ఉంటుంది అని విచారించాను, కారుగల వాళ్ళనే అడిగాను. 'బండి పెట్టుకొంటే ఎంత అవుతుందో కారుపెట్టుకొన్నా అంతే అవుతుంది, అయిదారు రూపాయలు అటూ ఇటూ! అంతే, అన్నారు.

మరి డ్రైవరుకీ ఇయ్యాలిగదా ఏ యాభై యో అంటే, వాళ్లు నవ్వి ఇప్పుడు డ్రైవరును ఎవరు పెడుతున్నా రయ్యా స్వంతంగా నడపటం నేర్చుకో అన్నారు.

ఇంతకూ బండికొన్నా ముప్పై రూపాయలు అవుతూనే ఉండె! ఇంకో అయిదో ఆరో అయితే అయింది, కారు కొన టమే మంచిదని నిశ్చయించాము.

కారుకొని మనకు కావలసినప్పుడు ఉపయోగించుకొని మిగతా సమయాల్లో కిరాయికి తిప్పటానికి మా ఆవిడకూడా ఒప్పుకొన్నది, అందుకు నేను చాలా సంతోషించాను.

/ఇక ఎటొచ్చీ వచ్చిన పెద్ద ఇబ్బంది అలా కారుకొంటా నికి డబ్బు ఏదీ అని! ఎంతలేకన్నా రెండు మూడు వేలు కావాలె, కొంత ఆలోచించిన మీదట అదికూడా ద్దపె

యిబ్బందిలాగ కనపడలేదు. ఎందుకంటే వాయిదాలమీద తీర్చే పద్ధతి మీద కారు అమ్మకారు కావాలా అంటే.

కారు అద్దెకు తిప్పితే నెలకు ఎంతలేదన్నా ఓ వంద రూపాయలు దొరక్కమానవు అన్ని ఖర్చులూ పోను.

అది కంపెనీ వాడికి కడితే కొద్దిరోజులలో బాకీ తీరటమేకాక కారు మనకు మిగిలిపోతుంది.

మా ఆవిడ ఊరికే విని ఊరుకొంది ఇదంతా నేను చెపుతూవుంటే !

'కారు మనకు మిగిలి పోవటంఅంటే—కారు మనకు దమ్మిడీ ఖర్చులేకుండా వచ్చినట్లు తెలిసిందా ?' అన్నాను.

అప్పటికీ ఆమెగారు ఏమీ ఆశ్చర్యపడనూ లేదు సంతోషమూ కనుపర్చలేదు, చివరకు అన్నది—'డ్రైవరును పెట్టవద్దూ కారు అద్దెకు తిప్పాలంటే ?

'పెట్టాలి'

ఈ మాటవిని కాంతం పకపకా నవ్వి 'డ్రైవరుకు ఏమిస్తారు మీరు ఏమి మిగుల్చుకొంటారు ? అని హేళనగా నవ్వింది.

అంత హేళనగా నవ్వితే ఎవరికైనా కోపం వస్తుంది. కాని ఇప్పుడు నేను చాలా శాంతంగా ఉంటున్నాను కదూ. అందుకని ఏమీ అనలేదు. నేనూ నవ్వి ఊరుకొన్నాను.

మా వూళ్ళో చాలామంది డ్రైవర్లు ఉన్నారు. ఎవరినో ఒకరిని పిలుస్తాను—ఏ అబ్బాయ్ ఈ కారు నీవు

తీసుకో. నీయిష్టం వచ్చినట్లు శాడుగకు త్రిప్పుకో. నా ఉప యోగానికి మటుకు ప్రొద్దునొకసారీ సాయంత్రం ఓసారీ తీసు కొనిరా, నెలకు నాకు వంద రూపాయలు ఇయ్యి, అంటే ఎవరు బడితే వాళ్ళే యిస్తారు—ఆ వందా కంపినీ వాడికి పంపేస్తాను అని ఇల్లాగ ప్లాను వేసుకొని ఒక కేటలాగు తెప్పించి ఈ కార్లను గురించి భోగట్టా అంతా తెలుసు కొన్నాను. కార్లలో బేబీ ఆస్టిన్ కారు చాలా సౌఖ్యంగా ఉండటమే కాకుండా చాలా చౌకలో వస్తుంది, పెట్రోలు కూడా అట్టే తాగదు. ఆ తరువాత కంపినీ వారికి నాకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినవి.

ఇది ఇప్పటి సంగతి కాదు. సుమారు పదిహేను ఏండ్ల క్రిందటి సంగతి. ఆ రోజులు కాబట్టి రెండు వేలకే ఒక చిన్న కారు ఇయ్యటానికి ఒప్పుకొన్నారు. వాయిదాల మీద తీర్చ డానికికూడా అంగీకరించాము.

అయితే ఎన్ని వాయిదాలమీద తీర్చ మంటారు, ఎన్ని సంవత్సరాలలో ఈ అప్పుతీరుతుంది అని నేను అడి గాను.

కంపినీవారు ఈ ప్రశ్నకు గడుసుగా జవాబుఇచ్చారు. ఏమని అంటే, ఎన్ని సంవత్సరాలలో తీరుతుంది అన్న ప్రశ్నకు మీరే సమాధానం చెప్పుకోవాలె. మీరు నెలనెల ఇచ్చే మొత్తంమీద ఆధారపడి ఉంటుంది అన్నారు.

నేను ఊరుకొన్నానూ! మళ్ళీ వ్రాశాను. అయితే నెలకు ఎంత మొత్తం కట్టమంటారు. ఆ విషయంలో మీరు ఏమైనా వత్తిడి చేస్తారా అని అడిగాను.

నెలకు ఎంత మొత్తం కట్టాలన్న విషయం కూడా మీరే నిర్ణయించుకోండి—అది మీ ఆర్థిక దార్ఢ్యము మీద ఆధారపడి ఉంటుంది. అన్నారు.

సరే, ఇంకేం అన్నీ అనుకూలంగానే ఉన్నాయి కాని కంపెనీ వారికి నెలనెలా కట్టవలసిన మొత్తాన్ని గురించి మళ్ళీ కాస్త ఆందోళన పడ్డాను. వాళ్ళేమో నెలకు ఇంత కట్టాలని నిర్బంధంచేయక పోయిరి. నేను మటుకు వంద ఇస్తాను. రెండు వందలిస్తానూ అనీ ముందుగానే ఎందుకు అనాలి?

ఒక డ్రైవరుకి కారు ఇచ్చేసి నెలకు నాకు నూరు రూపాయలు ఇయ్యి అబ్బాయ్ అని అనుకొన్నమాట నిజమే! వాడు అల్లాగ ఇయ్యవచ్చు ఇయ్యకపోవచ్చు. ఇచ్చినా ఆ వందా కంపెనీ వారికి కట్టటం ఎందుకూ!

ఏ పదో కట్టి మిగతాది నేనే వాడుకోకూడదా అని ఓ ఆలోచన వచ్చింది.

ఆలోచించగా ఆలోచించగా అదే చాలా మంచి ఏర్పాటు అని తోచింది,

సరే అనుకొని వెంటనే కంపెనీకి వ్రాసేశాను. ఒక కారు పంపవలసదనీ డబ్బు నెలకు పదిరూపాయలు చొప్పున

ఇస్తానని అలాగ కాయితం వ్రాసి ఇయ్యటానికి సిద్ధంగా ఉన్నా నని కూడా తెలియజేశాను.

మా ఆవిడతో కూడా చెప్పేశాను కారు వస్తుందని.

డ్రైవరును కుదిర్చారా ? అంది.

కుదిర్చాను అన్నాను.

అయితే...ఎట్లా...రోజుకు రెండుసార్లు మనకు ఇచ్చే టట్లా ?

అవును.

రెండుసార్లూ అంటే ? అని ఆవిడ ఏదో ఆలోచిస్తున్నది. రెండుసార్లూ అంటే ఏముందీ ప్రొద్దునొకసారి, సాయంత్రం ఒకసారి అని చెప్పాను.

అయితే మీరు స్కూలుకు వెళ్ళటానికి రావటానికి సరిపోతుంది—అంతేగా ?

అవునన్నాను నేను.

అయితే నేను మా అక్కయ్య గారింటికి వెళ్ళాలంటే?

నేను స్కూలుకు వెళ్ళేటప్పుడే నాతోరా. నిన్ను అక్కడదించే నేను స్కూలుకు పోతాను.

అట్లా. ఎట్లా వీలు అవుతుందండీ......మీరు పది గంటలకే స్కూలుకు వెళ్ళిపోతారాయె నాకు అది పనివేళ ఆయె ఎట్లాగండీ ? అని గునిసింది—

మరి ఎప్పుడు కావాలంటావూ ?

రెండింటికో మూడింటికో కావాలె.

మూడు గంటలకు కావాలంటె ఎట్లా వస్తుంది, అప్పుడు మన కారు ఊళ్ళో బాడుగకు తిరుగుతూ ఉంటుంది.

ఎట్లా మరి నాకు కారు ఇయ్యరా ?

జాలివేసింది. ఇంతా కోరుకొని ఇంటికైన మనిషికి ఇయ్యకపోతే ఎట్లా ?—ఇద్దామా అంటె అది రైళ్ళు వచ్చే వేళ. కిరాయికి తిరిగే వేళానాయెను. అందుకని బ్రతిమాలుతూ— అన్నాను—నివ్వు కూడా నేను వెళ్ళేటప్పుడే రావే, లేకపోతే నాయింత్రం అయిదు గంటలకు...ఎట్లాగో...వీలు చేసుకో—

ఎలా వీలు అవుతుందండీ ?

నేను చెప్తాను విను, మీ అక్కయ్యగారి ఇంటికి వెళ్ళదలుచుకొన్న రోజున పెందలాడే వంటచేసి నాకు పెట్టి నివ్వు/పిల్లలూ తిని పది గంటలకల్లా రెడీగా ఉండండి. నిన్ను తీసుకెళ్ళి అక్కడ దింపి నేను స్కూలుకు వెడతాను. అయిదు గంటలకు ఎట్లాగూ కారు నాకోసం స్కూలుకు రావాలెగా, అప్పుడు నిన్ను ఎక్కించుకొని వచ్చే ఏర్పాటు చేస్తాను. అంతే గాని ఎటుగాని వేళ మధ్యాహ్నం ఇయ్యమంటే ఎలాగ చెప్పూ, ఇల్లాగ బ్రతిమిలాడి చెప్పినావినక ఆమె తనకు మధ్యాహ్నం మూడుగంటల వేళకే కారు కావాలాఅని పట్టు బట్టింది. నేను మటుకు ఎంత సేపని ఓపిక పట్టేది. కాసేపు చూశాను పోనీ సరే నంటుందేమోనని, కాదు కూడదు ఆ వేళనే కావాలన్నది. నాకు విసుగుపుట్టి, ఊహూ ఆ వేళప్పుడు ఇయ్యడానికి వీల్లేదే ? అని నిక్కచ్చగా చెప్పేశాను.

ఆవిడకూ బాగా కోపం వచ్చింది కామాలు, వీల్లేక పోతే మీరొక్కరే ఎక్కి ఊరేగండి అని విసుక్కుంటూ వెళ్ళిపోయింది.

ఆ తరువాత పోనీ ఇద్దరకీ వీలైన పద్ధతి ఏదైనా ఉంటే చూద్దామని ప్రయత్నించాను. కాని ఆమె మరీ చెట్టెక్కి కూర్చుంటే నేనేం చేసేది ? తను ఎక్కడికైనా వెళ్ళడానికే కాకుండా తనఅక్కా అక్కపిల్లలూ ఎక్కడికైనా వెళ్ళాలన్నా కారు ఆమెకు అప్ప జెప్పాలట, అంతేకాదు.

తన అల్లుణ్ణి కూతురిని గుడ్లవల్లేరునుంచి బందరు తీసుకొని రావటానికి పండుగ పండుగకూ కారు పంపాలట !

ఇంకా, తానూ, పిల్లలూ అప్పుడప్పుడు సాయంత్రానికి సముద్రం వైపుకు వెళ్ళి వస్తూఉండాలట ! ఇష్టమైతే నేను కూడా తమతో రావచ్చునట !

మొత్తంమీద ఆ కారు హామేషా ఆమెగారి పర్యటనలకై వినియోగపడాలె నన్నట్లు తేల్చి చెప్పింది.

పోని ఆమె చెప్పినట్లే చేస్తే కారువల్ల నాకేమి ఆదాయుంరాదు. నెలకు పది కట్టాలె పోనిలే అట్లాగే చేద్దాము అనుకొని మనస్సుకు సమాధానం చెప్పుకొన్నాను.

నెలకు పది కడితె సంవత్సరానికి నూటఇరవై అవుతుంది—ఇరవై ఏండ్లలో అప్పుతీరిపోతుంది. ఈ ఇరవై ఏండ్లు కారు నాయిష్టంవచ్చినట్లు వాడుకోవచ్చు అని సంతోషించాను.

సంతోషించటమే కాకుండా స్నేహితు లందరికీ చెప్పాను. అంతా సంతోషించారు. అన్నీ సిద్ధంజేసుకు కూర్చున్నాము. కానీ కారు పంపలేదు. ఆ కంపినీవాళ్ళు ఎందుకు పంపలేదో నాకూ అర్థంకావటంలేదు ! గిట్టనివాళ్ళు ఏదో చెప్పి ఉంటారు ఆ కంపిని వాళ్ళతో, ఇంతకూ మాకు స్వంతంగా కారు ఉంచుకొనే యోగంలేకపోయింది...ఏం జేస్తాం !

# బ్యాంకి

బ్యాంకీలో డబ్బు వేసి, ఎవరికన్నా ఇవ్వాలిసివస్తే చెక్కు వ్రాసి ఇయ్యాలని నాకు ఎన్నాళ్ళబట్టో సరదా. చెక్కు వ్రాసి ఇస్తూ ఉంటారే వాళ్ళనుచూస్తేనాకు ఎంతో గౌరవం. చెక్కువ్రాసేవాడికి బ్యాంకీలో ఎంతడబ్బు ఉందో ఎవ్వరికి తెలియదు కాని చాలా ఉండి ఉండాలే అనిపిస్తుంది సామాన్యుడైతే వాడికి బ్యాంకీలో వేయటానికి డబ్బు ఎక్కడినుంచి వస్తుంది! వచ్చింది కాస్తా తాలింపులకు సరిపోతుందిగాని.

కాబట్టి చెక్కు వ్రాశాడూ అంటే వాడిదగ్గర కాస్తో కూస్తో డబ్బుఉన్న దన్నమాటే! అదీగాక, బ్యాంకీతో వ్యవహారం ఉన్న మనిషి, చాలాజాగ్రత్తమనిషి అనీ, చాలా డబ్బు దాచిపెట్టి ఉంటాడనీ లోకం అభిప్రాయపడుతుంది.

కోటయ్యకొట్లో నేను బియ్యం తెచ్చుకొని నెలాఖరుకు లెఖఇస్తూవుంటాను అనుకోండి. ఆయనడబ్బు అడిగినపుడు చెక్కువ్రాసియిస్తే అతనికి నాయందు ఏర్పడే గౌరవం వేరు, రూపాయలు లెక్కపెట్టి ఇస్తే ఏర్పడే గౌరవం వేరు. ఎల్లాగయినా చెక్కు చెక్కే అనుకోండి. చేతిలో డబ్బుఉండను ఎవరైనావచ్చి అడుగుతారు. లేదని అనటం ఎంతఅసహ్యం? బ్యాంకిలో మనకుడబ్బుఉందీ అని ఒకపుకారు పుట్టిన తరువాత డబ్బులేనపుడు లేదని చెప్పనక్కరలేదు. దర్జాగా అనొచ్చు 'బ్యాంకిలోనుంచి తియ్యాలయ్యా! ఇవ్వాళ రేపూ

బ్యాంకీకి సెలవ. ఎల్లుండిరా ఇస్తాను' అని ఈలోపున ఎక్క-డో పుట్టించితీసుకొచ్చి యియ్యానూవచ్చు. బ్యాంకి ఎకౌంటుగల ఎట్టుని ప్యాస్ పుస్తకం చేత్తోపట్టుకుంటేచాలు, చూచినవాళ్ళకు మనయెందు ఎంతైనా గౌరవం కలుగుతుంది. ఇంకా చాలా లాభాలున్నయి. అందుకనే ఎట్లాగయినా సరే బ్యాంకీలో డబ్బువేయాలని బుద్ధిపుట్టింది.

అయితే ఎట్లాగ వేయటం ?

వచ్చిన ఇబ్బంది ఏమిటీ అంటే మనకు వచ్చేవి నెలకు యాభైరూపాయలు. ఖర్చు డెబ్బైరూపాయలు పైచిలుకు. ఫస్టుతారీఖు వచ్చేసరికి బియ్యపు వర్తకుడు. చిల్లరకొట్టు ఆసామి, పాలమనిషి పున్నాయ, నెయ్యిపోసిన సీతమ్మ, పని చేసే మహాలక్ష్మి, చాకలి సుభాన్ అంతా వీధిఅరుగుమీద కూర్చుని ఉంటారు. వీళ్ళందరికి ఇయ్యాలె. ఇవికాక మా ఆవిడ నాయుడుగారి భార్యదగ్గర నాలుగు రూపాయలు, నాంచారమ్మ గారిదగ్గర నాలుగురూపాయలూ తెచ్చినచేబదుళ్ళు తీర్చాలె.

ఇవన్నీతీర్చి ఇంకామిగిలేదేమిటి ? బ్యాంకిలో వేసేదేమిటి ! బడ్జెట్ బ్యాలెన్సు కాదాయె ? ఎప్పుడూ డిఫిసిట్ బడ్జెట్! ఎల్లాగ డబ్బుమిగిల్చి బ్యాంకులో వేయుటమూ అని చాలా రోజులు తీవ్రంగా ఆలోచించాను.

చివరకు ఓ ఉపాయంతోచింది. ఏమిటంటే కొంత అప్పుజేసి అదే తీసికెళ్ళి బ్యాంకిలో వేద్దామని !

అప్పుడు కోటయ్య వచ్చి "ఏమండీ డబ్బు ఇప్పించారు కారు" అని అడిగితే "ఇస్తాను లేవయ్యా, ఏంతొందర?" అని విసుక్కుంటాను.

కోటయ్యకేం తెలుసు నాకు బ్యాంకిలో డబ్బు ఉందని! మామూలు మనిషి సే అనుకోని ముఖం చిట్లించి, 'ఏమిటండీ ఇయ్యకపోతే ఎల్లాగండీ' అంటాడు. నాకు కోపం వచ్చేస్తుంది. 'ఏమయ్యోయి అంతకచ్చితంగా అడిగితే, నిలుచున్న పాటున ఇచ్చేస్తాను తెలుసునా? డబ్బు లేక కాదు. బ్యాంకిలో నుంచి తెచ్చి ఇయ్యటానికి బద్ధకించిగాని' అని విసుక్కుని అతను చూస్తూ ఉండగానే డ్రాయరులో నుంచి చెక్కు బుక్ తీసి బర బరా వ్రాసి, అతని ముఖాన పారేస్తాను. పాపుకారు ఏమౌతాడు? పిల్లి అయిపోతాడు. ఆ రోజునుంచి నన్ను ఎక్కువగా గౌరవిస్తాడు ఇప్పటిలాగ కాక.

బట్టలకొట్లోకి వెళ్ళటం. మనకు కావలసిన బట్టలు తీసికోటం. తాకీన చెక్కు వ్రాసి కౌంటరుమీద పారేయటం!

నేను ఇల్లాగ అక్కడకెళ్ళి చెక్కు వ్రాసి ఇస్తాను ఇక్కడకెళ్ళి చెక్ వ్రాసి ఇస్తాను అని చెప్పటం అనవసరం ఊహించుకోవచ్చు. అయితే ఒక చిఇబ్బందివచ్చింది. దీనికి ఓ రెండు వందలుభూపాయలు ఎవ్వరూ అప్పుఇయ్యలేదు కర్మం!

అప్పుకోసం తెగతిరిగాను. నేను అల్లాగ తిరుగుతూ ఉంటే ఓ మిత్రుడుచూసి ఒకసలహా చెప్పాడు. అప్పు సాహుకార్ల అడగవద్దనీ, వాళ్ళు ఎక్కువవడ్డీ తీసుకుంటారనీ, బ్యాంకీలో అయితే తక్కువ వడ్డీకే అప్పుదొరుకుతుందనీ,

అల్లాగయితే మరీనయం అక్కడే అప్పతీసికొని, అక్కడే డిపాజిట్ చేసి నాకు కావలసినప్పుడు చెక్కువ్రాసి తెచ్చుకోవచ్చును ఇతరులకు ఇవ్వాల్సినా చెక్కే ఇయ్యవచ్చు. ఈ పద్ధతి అన్నివిధాల బాగుంది.

సరే అల్లాగ చేద్దామని నిశ్చయించుకొని బ్యాంకికి వెళ్ళాను. అదే నేను బ్యాంకికి మొదటిసారి వెళ్ళటం. కుర్చీలు, బల్లలూ, ఫానూ, కిటకటాల వెనకాల గుమాస్తాలు, ఏదో అంతా గాభరగా ఉంది.

ఇంకెల్లా ఎవరిని అడగాలె నాకు అప్పుకావాలని—ఎవరిని అడిగితే ఏమంటారో అని భయం.

అదృష్టవశాత్తు నాకు తెలిసిన షాహుకారొకాయన కనపడితే ఆయన్నడిగాను. రహస్యంగా ఆయన చెప్పాడు, బ్యాంకీవాళ్ళు అందరికీ అప్పు లియ్యరట! ఏం జెయ్యాలట అంటే 'ఈయన పెద్దమనిషి. ఈ అప్పు తప్పకుండా తీరుస్తారు' ఒక వేళ ఆయన తీర్చకపోతే నేను తీరుస్తాను అని హామీ ఉండగల మంచి పెద్దమనిషిని తీసుకొచ్చి నేను బ్యాంకివారికి అప్పజెప్పాలట!

ఏడ్చినట్లుంది!

ఆ మాత్రం పరపతి ఉంటే, నేను ఆ పెద్దమనిషిదగ్గరే కావలసిన డబ్బు తీసుకొంటానుగాని ఈ బ్యాంకికి ఎందుకు వస్తాను.

అదీకాక,

నాకు ఓ రెండువందలరూపాయలు అప్పుఇయ్యటానికి భయపడి బ్యాంకే అనుమానిస్తే, ఇక ఊళ్ళో ఏ పెద్దమనిషి చూస్తూ, చూస్తూ నమ్మి నాకు హామీగా ఉంటాడు. అప్పుపుచ్చుకొంటానికి ఈపద్ధతి నాకు కుదరదు. ఇంకేమైనా ఉపాయం ఉంటే చెప్పు అన్నాను.

బంగారపు సొమ్ములు ఏమైనాఉంటే ఇస్తారూ అన్నాడు ఆయన. కొంచెం బాగానే ఉంది ఈ మాట! ఉండటంఅంటే ఎక్కడ ఉండాలె అని అడిగాను. బ్యాంకివారికి హామీగా చూపాలండీ అన్నాడు.

మా ఆవిడ మెడలో ఏమీలేకపోయినా, మా ఇంటికి ఇటూ, అటూకూడా ఉన్నారు బోలెడుమంది సొమ్ముగల వాళ్ళు అవేమైనా చూపవచ్చులే. ఊరికే చూపటమేకదా అనుకొన్నాను. కాని అవి తీసుకొచ్చి బ్యాంకివారికి ఇయ్యాలని చెప్పేసరికి నాకుకష్టంవేసింది. ఆసొమ్ము బ్యాంకివారికి హామీగా దూరాన్నుంచి చూపగలను గాని తీసుకొచ్చి ఇయ్యటం ఎలాగు? ఇదినాకు ఏమాత్రం అనుకూలంగా లేదు. నిరుత్సాహంతో ఇంటికి వచ్చేశాను.

నా స్వంతసొమ్ము బ్యాంకిలో హామీగా ఇస్తే, ఏదో కొంతడబ్బు అప్పు ఇస్తారట! బ్యాంకివారికి ఇంతఆలోచన లేకపోవటం ఏమిటో! బంగారం కొనుక్కునే శక్తివుంటే అప్పు అడగాల్సిన ఖర్మం ఎందుకు పడుతుంది అసలు!

ఇంతకూ బ్యాంకిలో డబ్బు వేయటమూ చెక్కులు వ్రాయటమూ అనే యోగ్యత నాకు లేదు.

రోజూ చూచేవాణ్ణి ఎంతో మంది బ్యాంకీమెట్లు ఎక్కటమూ దిగుతూ ఉండటమూను! ఒక్కొక్కరిచేతిలో కట్టలు కట్టలు నోట్లు ఉండేవి! ఏం, జేసుకు పుట్టారో వాళ్ళు అంత డబ్బు ఏట్లా దాచుకోగలిగారు అని ఆశ్చర్యం కలుగుతూ ఉండేది!

కాని ఈ కోరిక చాలాబలమైనది అయింది. గుండెల్లో ఓ బరువుఅయింది. అదే కలవరింత అయింది. ఏమైనాకానీ, కొంతడబ్బు ఎల్లాగో అల్లా డిపాజిట్ చేసితీరాలని నిశ్చయించుకొన్నాను. ఎల్లాగ ?

కొన్నిరోజులు ఆలోచించినమీదట ఒక ఉపాయం తోచింది. జీతం వచ్చినరోజున, డబ్బుతీసికొని, ఇటికిరాకుండా అటునుంచి అటే బ్యాంకీకి వెళ్ళటం జీతం, జీతం బ్యాంకీలో వేసెయ్యటం ఏమన్నా కానీ! అదినేను చేయదల్చుకొన్నపని !

అల్లాగచేస్తే, ఇంటికొచ్చిన తరువాత ఇవ్వవలసిన వాళ్ళంతా అడిగితే ఎట్లాగా అన్న విషయం నాకు తోచక పోలేదు. అడగనీ, అందరికీ చెక్కులువ్రాసి ముఖాన పారేద్దాము అనుకొన్నాను. చాలా దర్జాగా ఉంటుంది కూడా.

ఈ మాత్రం ఉపాయం తోచిందికదా అని సంతోషించి నెల ఆఖరుకై ఆతురతతో నిరీక్షించాను. ఫస్టుతారీఖు వచ్చింది. జీతంతీసుకొని బ్యాంకికి పరుగెత్తుకొని వెళ్లాను. బ్యాంకీలో కాలుపెట్టేసరికి భయంవేసింది పీళ్లు, ఓ యాభై

రూపాయలు వేయనిస్తారా అని. పదివయాభై రూపాయలు తీసుకొచ్చావా బ్యాంకీలో వేయడానికి అంటారేమోనని భయం.

అదీకాక, ఎవరిని అడగాలె ఈ యాభై బ్యాంకీలో వెయ్యాలంటే !

అక్కడేమన్నా పెట్టెగిట్టె అలాంటిదిఉండి అందులో వెయ్యాలా ఉత్తరం పోస్టులో వేసినట్లు అని సందేహం కలిగింది. అల్లాగే వేస్తే నేను వేసినట్లు వాళ్ళకు తెలియటంఎల్లాగు? ఒకవేళ ఎవ్వరితోనైనా చెప్పాలేమో. ఇదిగో అబ్బాయి బ్యాంకిలో డబ్బువేస్తున్నాను చూడమని. ఇదంతా ఏదో గొడవగానేఉంది మొత్తంమీద !

ఇంకోభయముకూడాను. ఎవరినైనా అడిగితే ఏమంటారో గ్రహచారం! ఎట్లాగాబాబూ అనుకొన్నాను. ధైర్యం చేసి అడగలేక చూస్తూ నిలబడి ఊరుకొన్నాను. బ్యాంకి టైము అయిపోతుందేమోనని భయం.

అదృష్టవశాత్తు ఎవరో అబ్బాయి నా దగ్గరకువచ్చి ఏం కావాలండీ మాస్టారూ అన్నాడు. ప్రాణం లేచివచ్చింది. కాని ఆ కుఱ్ఱవాడితో చెబితే, వాడువెళ్ళి, అందరితోనూ చెప్పి నన్ను అల్లరిపెడతాడేమో! అసలు యాభై రూపాయలు వెయ్యవచ్చునో వెయ్యకూడదో! ఈ రభసఅంతా వీడిదగ్గర ఎందుకు ? అసలు ఏజంటుదగ్గరకే వెళ్ళి, ఆయన

తోనే, రహస్యంగా చెప్పి ఏసంగతీ గుట్టు చక్కగా తేల్చు కొని, పోదామని 'ఏజంటుగారిని చూడాలని' ఆ అబ్బాయి తో అన్నాను.

ఆ చిన్నవాడు నన్ను వెంటబెట్టుకొని మేడపైకి తీసు కెళ్ళి, రెండు మూడు హాలులలోనించి నడిపించుకొని వెళ్ళి ఒక గదితలుపునెట్టి, నన్ను లోపలికి రమ్మన్నాడు. ఇన్ని గదులలోనుంచి రావటం అంతా ఎవరాఈయన, ఏజెంటుతో ఏంపనిఉండి వెళ్ళుతున్నాడని యుగాదిగాచూడటం, కొంత మంది నవ్వుకోటం ఇవన్నీ చూచేసరికి నాకు కాస్త గాబరా వేసింది. ఏజంటుఅంటే ఇంత పై అధికారి అనుకోలేదు. ఏదో క్రిందే ఉంటాడేమో ననుకున్నాను. తీరా గదిలో ప్రవే శిస్తిని. ఏంచేసేది?...సరే ఏమన్నా కానీమని ఊరుకున్నాను.

ఆ ఏజంటు 'ఎవరయ్యాసీవు ఈ మాత్రానికి నాదగ్గ రకు ఎందుకొచ్చావు వెళ్ళు' అని విసుక్కొని ఉన్నట్లయితే చాలం బాగుండేది. ఇంత కథ జరిగేదికాదు. ఆయనఅల్లాగ అనక, చిరునవ్వుతో ఆహ్వానించి కూర్చోమని కలంవుల్లతో ఓ కుర్చీచూపి ఏవో కాయితాలమీద సంతకాలుచేయటం సాగించాడు. కానీవు నన్ను నా స్వంత ఆలోచనలకు వదిలే శాడు. ఇక నా ఆలోచనలు విపరీతంగా పోయినాయి. ఆయన నవ్వి హేళన చేస్తాడేమో అని ఒకటి.

పోనీ నవ్వనూ నవ్వాడు, హేళనా చెయ్యాడు అను కొందాం. నీకు బ్యాంకిలో వేయటానికి యాభైరూపాయలు

ఎక్కడవీఅంటే ఏం జెప్పాలె అని భయంవేసింది. నాస్వంతం అంటే నమ్ముతాడా? నీ జీతం ఎంతా అంటే, యాభైరూపాయలు అని చెప్పాల్సిందే కద! యాభైరూపాయల జీతగాడికి యాభైరూపాయలు వేయటానికి ఎట్లావచ్చినయ్యి అని అనుమానపడితే!

ఇక కాకపోతే, జీతం యావత్తూ వేస్తున్నానండీ అనాలె. ఇవ్వవలసిన వాళ్ళకు ఇచ్చావా అని అడిగితే! ఇయ్యలేదని చెప్పాలిసిందే గదా! చెపితే, సరే బాగానేవుంది, జీతంకాస్తా బ్యాంకిలో వేసి రేపటినుంచి నీ బాకీదార్లందరికీ చెక్కులిచ్చి మమ్ములను చంపుతావా అనికోప్పడుతాడేమో అసలు చేయదల్చుకొన్నపనే అదాయె. ఈ రహస్యం కాస్త ఆయన గ్రహిస్తే చిక్కులో పడిపోనూ!

ఆ యాభై నాకు అదనపు ఆదాయము, బ్యాంకీలో దాచుకొంటానికి వచ్చానని ఆయనకు నమ్మకం కలిగేలాగున చేయటానికి నేను ఏమి అబద్ధంఆడితే సరిపోతుందో నాకు తోచలేదు. ఇల్లాగ భయంకరమైన ఆలోచనలలోకి దిగాను.

పోనీ ఎందుకొచ్చినబాధ ఇదంతా వెళ్ళిపోదామని బుద్ధిపుట్టింది ఒకక్షణంలో. కాని ఎందుకొచ్చినట్లు, ఎందుకు వెళ్ళుతున్నట్లు! దానికి సమాధానం ఏం జెప్పను!

ఏమనిచెప్పి వెళ్ళిపోవాలె! ఆయన నాకు పరిచయుడన్నా అయితే ఏదోక్షేమసమాచారం అడిగివెళ్ళిపోవచ్చు. ఈయన పరిచయుడు కాకపోయె!

ఇంతలో ఆయన తనపని పూర్తిచేసుకొని నావంక చూశాడు, ఎందుకొచ్చానో చెప్పమన్నట్లు.

ఆయన కోప్పడేమనిషిలాగా లేడు. కాని నాకే గుండె దడ ఎక్కువైంది. నా బిక్కముఖం చూచీ, ఆయన 'చెప్పండి' అని హెచ్చరించాడు. అప్పుడు ఆయన ప్రక్కన ఒక ప్యూనూ, ఇంకెవరో ఓ ఆసామీ ఉన్నారు. ఇక్కడ నాకు ఎల్లాగూ చీవాట్లు తగిలేలాగానే ఉన్నాయి! వీళ్ళంతా ఎందుకు వినటం అని అనుకొని మీతో ఓమాట చెప్పాలండీ అన్నాను వాళ్ళవంక అనుమానంగా చూస్తూ, భయంతో.

నాభయంచూచి ఆయనా భయపడ్డాడు. రజాకార్లు వచ్చి, ఆ బ్యాంకీని దోచుకోబోతున్నారని నాకు తెలిసి, ఆ వార్త రహస్యంగా చెపటానికి వచ్చానని ఆ ఏజెంటు అనుకున్నాకూడా ఆశ్చర్య పడవలసిన అవసరంలేదు. నా బిక్కముఖం, వణుకుతూఉన్న గొంతుక అదురుతున్న పెదవులు. బెదురుచూపులు ఆయనను అల్లాగ చేయకపోతే ఆశ్చర్యం పడాలె నిజానికి!

ఆయన వెంటనే, అందరినిపొమ్మని చెప్పి 'ఏమిటండీ?' అని ఆదుర్దాగాఅడిగాడు. ఇక చెప్పకపోతే తప్పేటట్లులేదు. నా కుర్చీ ఆయనకు దగ్గరగా ఉండేలాగున కొంచెము ముందుకు లాక్కొని, అది కాదండీ, అంటూ ప్రారంభించాను. 'ఏది కాదు?' అన్నాడు ఏజెంటు వెంటనే! చచ్చాను. నాకున్న ధైర్యం కాస్తా చప్పబడి ఊరుకుంది మళ్ళీఅన్నాను 'అది

కాదండీ, క్షమించండి' అని. 'క్షమిస్తానయ్యా, తప్పక క్షమిస్తాను ఏమిటో చెప్పు చూపక అవతల నాకు చాలాపని ఉంది' అని ఆయన విసుక్కున్నాడు—'నేనూ,... యాభై రూపాయలూ... బ్యాంకీలో... వెయ్యాలని వచ్చాను...' అన్నాను ఎల్లాగో ధైర్యం తెచ్చుకొని ఆయన ఆ మాటలువిని, ముఖం చిట్లించి దీనికి ఇంత రహస్యమూ ఎందుకూ, అంటూ నన్ను రెక్కుచ్చుకొని కౌంటరు దగ్గరకు తీసుకెళ్ళి 'ఈయన యాభై రూపాయలు బ్యాంకీలో డిపాజిట్ చేస్తారట తీసుకో' అని పెద్దగా ఏదో తప్పుచేస్తున్నవాణ్ణి క్షమించమని చెప్పినట్లు చెప్పి వెళ్ళిపోయినాడు.

సరే, ఏంజేస్తాం, ఇంత అవస్థాచేతులారా తెచ్చిపెట్టుకొన్నానుగదాఅని అనుకొని ఆ యాభై రూపాయలూ ఆయన బల్లమీద పెట్టాను. ఆ గుమస్తా ఆడబ్బు మళ్ళీనాకు ఇచ్చివేశాడు వెంటనే!! ఆరిదీనిదుంపతెగ! అనుకొన్నంత పనీ అయింది! వెధవయాభైరూపాయలు బ్యాంకిలో వెయ్యటానికి వచ్చావూ!...చాల్లే! అని కోపంతో మళ్ళీ నాడబ్బు నాకు ఇచ్చేశాడు. 'అఁహ ఇక్కడ కాదు డబ్బు ఇయ్యాలిసింది. ఈ ఫారం పూర్తిచేసి అక్కడఇయ్యండి' అంటూ ఆయన ఇంకోగదివైపుకు చెయ్యి విసిరిన దాకా నాకు అసలు విషయం తెలియలేదు.

ఆయన చూపినగదిలోకి నేను వెళ్ళలేదు. అక్కడనుంచి ఇక్కడకూ, ఇక్కడనుంచి అక్కడకూ ఏమిటి యీ

తిరగటం! నేను తక్కువమొత్తం తేబట్టే గదా, బీదవాణ్ణి కాబట్టేగదా, నన్ను వీళ్ళు ఇల్లాగ ఏడిపిస్తున్నారని పుట్టెడు దుఃఖం వచ్చింది, కోపంకూడా వచ్చింది.

ఇంకా అక్కడ నేను క్షణం ఉండదల్చుకోలేదు. ఆయన ఇచ్చినకాగితం చేత్తోపట్టుకొని మెల్లగా బైటకి జారుతున్నాను.

ఇంతలో ఒక నౌకరువచ్చి అల్లాకాదు, ఇల్లారండి అని నన్ను ఆ గదిలోకి నడిపించుకొని పోయినాడు.

ఆ గదిలో షరాఫ్ కూర్చున్నాడు. నాచేత ఆ ఫారం పూర్తిచేయించాడు. ఆ కాయితంతీసుకొని, చెయ్యిచాచాడు, నేను, జీతం జీతం, యాభైరూపాయలూ, ఆయన చేతిలో పెట్టాను. ఆయన తీసుకొని జాగ్రత్తగా లెక్కపెట్టుకొని, నేను చూస్తూఉండంగానే ట్రేలోకి విసరివేశాడు—నేను కష్టపడి సంపాదించిన డబ్బు ఆ మనిషి అల్లాగ నిర్లక్ష్యంగా విసిరికొడుతూ ఉంటే నాకు ఎంతో కష్టం వేసింది.

నేను అక్కడేనుంచుని ఉన్నాను డబ్బు ముట్టినట్లు రసీదు ఏమైనా ఇస్తాడేమోనని. కాని ఆయన రసీదుఇయ్యక ఇక మీరు వెళ్ళవచ్చు. ప్యాసుబుక్కు వెనకనుంచి పంపిస్తాము అన్నాడు. చేతికొక కాయితంముక్కఅయినా రాకుండా యాభైరూపాయలు వెళ్ళిపోయినై! ఇప్పుడేమనుకుంటే ఏమి లాభం అనుకొని విచారంతో బైటికి వచ్చేశాను.

డబ్బు వేయటానికీ ఇంతకర్మకాండ ఉంటే, మళ్ళీతీసు కోటానికి ఎంత ఉందో అన్నదిగులుకూడా పట్టుకొన్నది కాని అక్కడున్న గుమస్తా చెప్పాడు ఎప్పుడుబడితే అప్పుడు మళ్ళీ నా డబ్బు నేను తీసుకోవచ్చునని. సరేనని తృప్తిపడి మెట్లుదిగి వీధిలోకి వచ్చేశాను.

ఎట్లాగయితేనేం, ఓ యాభైరూపాయలు బ్యాంకిలో వేశాను. ఆ రోజే నా ఆర్థిక అభ్యుదయము ప్రారంభం అయిం దన్నమాట. గొడ్డుకుతిన్నదిబలం. మనిషికి ఉన్నదిబలం అంటారు. ఏదో ఓయాభై రూపాయలు నాకూ బ్యాంకీలో ఉన్నాయిగదా, అని నేనూ, సంతోషించాను.

నేను మెట్లుదిగిరావటం, ఇద్దరు ముగ్గురు స్నేహితులు చూచి కనుబొమ్మలెగరేశారు అంటూ ఇంతవాడవు అయి నావూఅన్న అర్థంలో. ఇంతవాడవేమిటి ఇంకా ఎంతవాడను అవుతానో, నీకేం తెలుసు అన్న అర్థంలో నేనూ చూచాను.

నేను బ్యాంకి బయటికివచ్చి ఒక్కసారి బ్యాంకీవంక గర్వంగా చూశాను. ఇవ్వాళ యాభై మాత్రమే ఉన్నా రేపు వందకాకూడదూ అనుకొని సంతోషంతో కాఫీహోటలు కెళ్ళాను ఒక కప్పు కాఫీ తాగుదామని! కాఫీతాగు తున్న పుడే చప్పున జ్ఞాపకంవచ్చింది, ఇంటిదగ్గర, ఈ పాటికల్లా అప్పులవాళ్ళు అంతా అరుగుపైన చేరి ఉంటారూ అని.

కాఫీ తాగేసి మళ్ళీ బ్యాంకికి వెళ్ళాను. ఎందుకంటే డబ్బు వేసుకొనే సరదాతీరిందికదా, బ్యాంకిలోనుంచి డబ్బు

తీసుకొనే సగదాకూడా అప్పుడే తీద్చుకొంటాము దానికి ఇంకో సారి ఎందుకూ అని !

ఈతభా నాకేమీ భయం వేయ లేదు. కీటిగా, నడిచి వెళ్ళి. డబ్బు తీసుకొంటానికి ఏం జెన్యూలండీ అని ఒక గుమాస్తాను అడిగాను. మీా డిపాజిట్టువున్నదా అన్నాడు ఆయన 'ఆ, ఉన్నది' అన్నాను గర్వంగా. అయితే ఈకాయి తంమీాద వ్రాయండీ అని ఒక ఫారం పూర్తిచేసి ఆయనకు ఇచ్చాను. ఆయన ఒక పెద్దపుస్తకం తెరిచిచూచి తలఊపి 'ఇవ్వాళే యాభై రూపాయలు డిపాజిట్ చేశారు' అన్నాడు.

'అవును, అన్నాను గర్వంగా.

అతడు మళ్ళీ నేను ఇచ్చిన చెక్కుచూచి

'అయితే యాభై విత్ డ్రా చేస్తున్నారా ?'

'ఆ' అన్నాను నేను స్థిరంగా.

ఆయన ఆశ్చర్యపడి నా వేపు వింతగాచూ., 'కొంత ఉంచుకోరాదండి' అన్నాడు. 'ఉహూ ఉంచను' అన్నాను కోపంగా. ఎందుకోనాకు బ్యాంకిపైన చాలా కోపం వచ్చింది.

డిపాజిట్టు మొత్తం అంతా తీస్తారా ?

'ఆ'

ఏం ?

'నా ఇష్టం' అన్నాను మరీ కోపంగా. కోపంఏమిటికి మండిపోయినాను. యాభైరూపాయలనే కాదు యాభైవేలు ఉన్నా తీసివేశేవాణ్ణి ఆ క్షణంలో. ఈ దరిద్రపు బ్యాంకిలో ఒకదమ్మిడీ అయినా ఉంచను అన్నట్లు చూశాను.

బ్యాంకిలో డిపాజిట్ చేసిన పావుగంటలో ఆ మొత్తం ముత్తం తీసివేసుకోంటానికి తగినంత కారణం ఉండాలెకదా! 'పిచ్చివాడు' అని వాళ్ళుఅనుకోకుండా ఉండాలంటే ఇంత కంటే మరో మార్గములేదు. నాకు బ్యాంకిపై చాలా కోపం వచ్చి, ఉన్నడబ్బుఅంతా తీసికెళ్ళుతున్నానని వాళ్ళు అనుకోవాలె అది నా ప్లాను! ఆ గుమస్తా నా వంక దీనంగా చూశాడు. బ్రతిమిలాడుతున్నట్లుగా 'అంతా తీసుకొంటారు టండీ'అన్నాడు.

'తీసుకోంటానండీ అంతాతీసుకోంటాను ఒక్కడబ్బుడీ కూడా ఉంచను' అని నిక్కచ్చిగా నిర్మొగమాటంగా, చెప్పేశాను.

పాపం ఆ గుమాస్తా విచారంతో చెక్ ప్యాసుచేసి షరాఫు దగ్గరకు, పంపాడు. షరాఫు డబ్బుయిచ్చేశాడు. అందరూ ఆశ్చర్యపోయినారు. నేను డబ్బు జాగ్రత్తగా పర్సులో పెట్టుకొని బయటికి వచ్చేస్తున్నాను.

ఆ గుమాస్తాలలో ఒకడు, అప్పుడే అనుకొన్నాను 'ఇది డిపాజిట్ చేసేముఖం కాదని' అన్నట్లు నాకు తోచింది.

నీకు ఇప్పుడు తెలిసిందీ ఆ సంగతి! మా స్నేహితులంతా, చాలాకాలం క్రిందే అన్నారు ఆ మాట! అని వాడి తెలివి తేటలను గురించి హేళనగా అనుకొని, మెట్లుదిగి చకచకా ఇంటికి వెళ్ళి పోయినాను.

---

# యం. శర్మ బి. ఏ. ఎల్. టీ.

శర్మ బి. ఏ ప్యాసు అయినాడు. అయితే ఏం లాభం! జీవితంలో ఒక్క తప్పుపని చేశాడు. దాని ఫలితం ఇప్పటికీ అనుభవిస్తున్నాడు. ఇక ముందూ అనుభవించక తప్పదు. అదేమిటీ అంటే వెధవ మాస్టరీ వృత్తి అవలంబించటమే! ఆ వచ్చే జీతం చాలి చాలకుండా ఉంది.

శర్మ పొద్దున్నే స్నానంచేసి అతుకులచొక్కా తొడుక్కొని అది కనపడకుండా పైన ఉత్తరీయం కప్పుకొన్నాడు. తన దారిద్ర్యాన్నిచూచి నవ్వుకొన్నాడు.

వీధి తలుపుతీసి గుమ్మంలో నుంచుని వెనక్కు తిరిగి చూశాడు. 'అహా! మరేం ఫరవాలేదు, ఆవిడ ఎక్కడో వంట ఇంట్లోఉంది. ఆవిడ రాకముందే వీధిలో పడితే మంచిది.' ఇల్లా అనుకొన్నాడు.

'వెడుతున్నారా ?'

ఈ కేకవిని ఉలిక్కిపడి వెనక్కుతిరిగిచూడటకి తప్పింది కాదు.

తాను వెడుతున్న సంగతి ఆమెకు ఎల్లాగ తెలిసిందో అని ఆశ్చర్య పడవలసిన పని అంతగాలేదు. ఏ పిల్లచెప్పినా చెప్పవచ్చు. కాకపోయినా ఆచసిది ప్రతి విషయం చెపుతుంది. తానువస్తూ ఉంటే నాలుగు ఫర్లాంగుల దూరంలో ఉండ

గానే, పరుగెత్తికెళ్ళి 'నాన్న వస్తున్నారే, అమ్మా' అని చెప్పేస్తుంది.

తాను వెడుతూ ఉంటే— వెడుతున్నారేవ్ అని చెప్పేస్తుంది.

శర్మ జీవితంలో ఇది ఒక్కటే ఆనందాన్ని ఇచ్చే విషయం. మహారాజులు వెడుతూవున్నా వస్తూ ఉన్నా ఇల్లాగ చెపుతూ ఉంటారు. ఈ విషయంలో మటుకు శర్మకు మహారాజులకు జరిగే మర్యాద జరుగుతున్నది.

వెడుతున్నారా అని అంటూ ఆవిడ రానే వచ్చింది. శర్మ తలఊపి వెడుతున్నా నన్నాడు వెంటనే అన్నది. నబ్బు బిళ్ళా... పాలడబ్బా, చేంతాడు... ఏదైనా కూర ... కావాలి. బొత్తిగా ఇబ్బందిగా ఉంది!

శర్మ తెల్లముఖం పెట్టాడు. ఒక క్షణంసేపు ఆ గడపపైనే నుంచుని, నడిచి పోయినాడు.

పాపం శర్మముఖం చూస్తే ఎవరికైనా జాలివేస్తుంది ఆ నిమిషంలో. ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు. అతడు ముందు వెడుతూవుంటే వెనకనుంచి ఎవరో పిలిచారు అతడు పలకలేదు. అసలు అతనికి వినిపిస్తేనా ?

ముందు బండ్లు, కార్లు వస్తున్నాయి అనే జ్ఞానంకూడా లేనట్టుంది. ఈ దౌర్భాగ్యుడు ఏ కారుక్రింద అయినా పడి చచ్చిపోతాడేమో! అంత పరధ్యానంగా ఉన్నాడు.

స్నేహితులుఎదురై చిరునవ్వునవ్వారు. శర్మ వాళ్ళను చూడలేదు. హెడ్ మాస్టరు కూడా ఎదురుగా వచ్చాడు.

శర్మ నమస్కారమైనా పెట్టలేదు, మాడలేదు. తలొంచుకు వెళ్లిపోయినాడు.

సబ్బుబిళ్ళ, చాంతాడు, కూర పాలడబ్బా ఈనాలుగు మాటలే అతడు మాటి మాటికి అనుకొంటున్నాడు ఈనాలుగు వస్తువులే అతని కళ్ళకు కనిపిస్తున్నాయి. శర్మకు మతి పోయినట్లే ఉంది.

శర్మ నడిబజారులో ఒకపక్కన నుంచున్నాడు. పిచ్చి చూపులు చూస్తున్నాడు.

ఇంతలో చేంతాళ్ళు అమ్మేమనిషి ఒకడువచ్చి చేంతాడు కావాలా బాబూ అన్నాడు. శర్మ కావాలె అన్నాడు.

ఇంకొకడు వచ్చి గొల్లభామ మార్కు పాలడబ్బా కావాలాండి ? అన్నాడు. శర్మ కావాలన్నాడు.

ఇంకొక ఆసామి సబ్బుబిళ్ళలు పట్టుకొచ్చి సబ్బుబిళ్ళ కావాలా బాబూ అన్నాడు. శర్మ కావాలన్నాడు.

మరొకడు వచ్చి, తోటకూర కావాలండీ స్వామీ అని అడిగాడు. శర్మ కావాలన్నాడు, ఈ నలుగురూ శర్మ చుట్టూ నుంచున్నారు. అతడు ఏదో ఆలోచిస్తూ నుంచున్నాడు. ఎవరికోసమో నిరీక్షిస్తున్నాడు. వీధినివెళ్ళే ప్రతి వ్యక్తిని పరీక్షగా చూస్తున్నాడు. అంతేకాని తనకు కావలసిన వస్తువులు తీసుకొని వాళ్ళను పంపివేయాలని అతనికి తోచలేదు.

ఆ సంగతుగూ నిలబడే ఉన్నారు. పెద్దమనిషి ఏదో ఆలోచిస్తున్నాడు, తొందర పెడితే బాగుండదు. అని వాళ్లు అనుకొని ఉంటారు.

పదినిమిషాలు గడిచింది. శర్మ మాట్లాడలేదు. తనకు కావలసిన వస్తువులు తీసికొని డబ్బుఇచ్చి వాళ్ళను పంపిస్తే తీరిపోయేది. ఎంతసేపటికీ కొనడే! అసలు వాళ్ళవంకనైనా చూడలేదు.

శర్మ నుంచుని నిద్రపోతున్నాడా ఏం కర్మం! వాళ్ళు మటుకు ఎంతసేపని నుంచుంటారు! నాలుగుచోట్ల తిరిగి అమ్ము కోవలసిన వాళ్ళుగదా! అప్పటికీ కాసేపు మాట్లాడలేదు. చివరకు అడిగారు

అసలు మీకు తోటకూర కావాలాండి ?

కావాలె.

సబ్బు బిళ్ళా?

కావాలె

పాలడబ్బా కూడా కావాలా అండి బాబూ ?

కావాలయ్యా.

చేంతాడూ ?

అదీ కావాలె.

నిద్రమత్తులో ఉన్నవాడిలాగ శర్మ జవాబులు చెప్పాడు.

సరే కొంటాడుగాలని వాళ్ళు ఇంకో నిమిషం నుంచున్నారు. శర్మ ఎవరికోసమో చూస్తునే ఉన్నాడు. వీళ

వైపు తిరగలేదు. వీళ్ళుమటుకు ఎంతసేపని నుంచుంటారు! విసుగుపుట్టింది బాబూ అన్నీ కావాలని అందరినీ నుంచో బెడితిరి! కొనరేం? అన్నాడు, అందులో ఒకడు.

ఉలిక్కిపడి శర్మ అన్నాడు. ఇంకొకటి కావాలయ్యా అదికూడా దొరుకుతుం దేమో నని చూస్తున్నాను!

ఏమిటి బాబూ, అన్నీ దొరుకుతయ్యి. అన్నాడు మరో ఆసామి.

'ఆ డబ్బు కావాలయ్యా ఎవరైనా ఇచ్చేవాళ్ళు కనపడతా రేమోనని చూస్తున్నాను' అన్నాడు శర్మ.

ఆపళంగా ఆ నలుగురూ నాలుగు మాటలూ అన్నారు. డబ్బులేకుండానే నను చోబెట్టావ్? నేను అప్పుడే అనుకొంటున్నాను ఇది కొనేముఖం కాదని! శర్మ వంచినతల ఎత్తలేదు.

ఇంత మందిని నుంచోబెట్టాను. కొనకపోతే వీళ్ళు ఊరుకొంటారా అని అతనికి తోచలేదు. ఏదో ఊహాలో ఉన్నాడు. రెండురూపాయలు అప్పు ఇమ్మని ఎవరిని అడుగు దామా అని అతను ఆలోచిస్తున్నాడు.

బజారువెంట వెళ్ళే ప్రతివాడి జేబులోనూ లావాటి పర్సుఉంది. 'సంగతి ఇల్లా ఎందుకు కావాలె. వాళ్ళందరి కంటేకూడా ఎక్కువ చదువుకొని దౌర్భాగ్య స్థితిలో ఉన్నానేం? ఇవి అతని ఆలోచనలు.

ఇంటి దగ్గర పాలు కావాలె బిడ్డకు. నీళ్ళు తోడుకుం టానికి బొక్కెన లేదు. ఏ బిందెలోనైనా తోడు కొందా

మంటే చేంతాడు కావాలె. సబ్బిబిళ్ళ అయిపోయి వారం రోజులైంది. ఆ పూటకు కూర లేదు.

అన్నీ కావలసినవే !

అందుకనే కావాలా అని అడిగితే కావాలన్నాడు. తెలివి తక్కువ శర్మ. వాళ్ళను అంతసేపు నుంచోబెడితే వాళ్ళు ఊరుకుంటారా ? బేగాలు పోయినాయని గోల పెట్టారు. నానా మాటలు అన్నారు కూడా మర్యాద తెలుసుకోకుండా !

ఇంతలో ఇక్కడేదో గొడవ జరుగుతున్నదని నలుగురూ పోగైనారు. సంగతంతా విని అందరూ శర్మ చేసింది తప్పుపని అని చెప్పారు. దగ్గరలో ఉన్న పోలీసు కానిస్టేబు కేక లేస్తున్నాడు.

శర్మకు ఏమీ తోచలేదు. ఇంకా కాసేపుఉంటే చాలామంది చేరటం, కానిస్టేబు తనపేరు వ్రాసుకోటం జరుగుతుంది.

యం. యస్. శర్మ, బి. ఏ., ఎల్, టి, సీనియర్ హిస్టరీ మాస్టరు గారికి, అప్పుడొక ఉపాయం తోచింది. అతని జేబులో నాలుగు అణాలు ఉన్నయి, అవితీసి, ఆ నలుగురికీ, తలో అణా ఇచ్చి, పొండిరా బాబూ, అల్లరి పెట్టకండి అని బ్రతిమిలాడుకొన్నాడు. వాళ్ళకు ఉత్తపుణ్యానికి తలొక అణా వచ్చింది. నిజానికి వాళ్ళు సంతోషంగా పోవలసిందే కదా ! ఊహూ అట్లా పోలేదు వాళ్ళు. సణుక్కుంటూ, ప్రొద్దున్నే ఎవరి ముఖం చూశామో, ఈ బడి పంతులు దాపరించాడు మనకు, అని తిట్టుకొంటూ వెళ్ళి పోయినారు.

"కూర లేకపోతేమానె! చేంతాడు లేకపోతేమానె! సబ్బు లేకపోతే పోయింది! పాలడబ్బా లేకపోతే ఎల్లాగ??

ఆ పావలా అన్నా ఉంటే, ఆ రోజుకు ఆవు పాలన్నా కొని బిడ్డకు పోసేవాళ్లు. అది కూడా వదిలింది!

దౌర్భాగ్యుడా, మైనంపూడి శ్రీరామశర్మ బి. ఏ., ఎల్. టి, ఇక ఇంటికి పో!

ఆవిడ నాలుగూ పెడుతుందిలే. కాకపోయినా ఆవిడ, ఎన్నిసార్లు అన్నది, ఈ వెధవమాస్టరీ ఉద్యోగం వదిలిపెట్టి, రిజిష్టరీ ఆఫీసులో ప్యూను పనికి కుదురుమని! నీవు విన్నావూ? పో! నీ గతి ముందు ఉందిలే!" ఇల్లా తనకు తాను చెప్పుకొని శర్మ బిక్కముఖంతో ఇంటిదారి పట్టాడు.

# ఉత్తరం

అమ్మాయికి ఉత్తరం వ్రాయమని ఆవిడ వారంరోజులు గోలపెట్టిన తరువాత ఒక ఆదివారం తీరిక చేసుకొని కూర్చుని ఏమి వ్రాయమంటావు కాంతం అని అడిగాను. కాంతం వచ్చి నా కుర్చీ ప్రక్కన నుంచున్నది. "ఇక చెప్పు" అన్నాను. చెప్పేదేమిటి వ్రాయండి అన్నది.

ఏమి వ్రాసేది ?

ఏమి వ్రాయాలో నేను చెప్పాలా? సముద్రస్నానానికి రమ్మని వ్రాయండి.

నేను సరేనని వ్రాశాను. "నీవు వ్రాసిన ఉత్తరం అందినది సంతోషం. ఇక్కడ అంతా క్షేమం. నీవు కార్తీక పౌర్ణమికి రావలసినది. ఏ బండికి వచ్చేదీ ముందుగా తెలియజేస్తే ఎవరో ఒకరం స్టేషనుకు వస్తాము."

ఇల్లా వ్రాసి ఉత్తరం పూర్తిచేసి, ఆవిడకు చదివి వినిపించాను. ఆవిడ అరచేతిని నోటికి అడ్డంపెట్టుకొని "అవ్వ, ఇదే ఉత్తరం వ్రాయటం అండీ." అని ఆశ్చర్యపోయింది.

ఉత్తరం వ్రాయటం అసలు నాకు తెలియనట్లే ఆమె తేల్చుకొన్నది. నా తెలివితక్కువతనం నాకు తెలిసివచ్చేటట్లు ఒక్క చురుకైన చూపుచూచింది. నేను చాలా సిగ్గుపడి ఆ కాయితం అక్కడపెట్టేసి. వేరే కాయితం తీసుకొని నీవు చెప్పు. చెప్పినట్లు వ్రాస్తాను.

ఇంత తెలివితక్కువ మొగుడుఉంటే ఏమిచేస్తాను, చెప్పుకోక అన్నట్లుచూచి, సరే వ్రాయండి అన్నది.

"చి॥ సౌ॥ మంగుతల్లిని దీవించి వ్రాయునది. ఉభయ కుశలోపరి. ఇక్కడ అంతా క్షేమం. మీ క్షేమం వ్రాయించవలెను"

నేను మాట్లాడకుండా వ్రాశాను.

వ్రాశారా ?

ఆఁ.

"చి॥ రాధిగాడు బాగా అల్లరిచేస్తున్నాడు."

గంగాళంలో నీళ్ళు పారపోస్తున్నాడని కూడా వ్రాయాలా ? తమ్ముడు ఇంతింత ఘనకార్యాలు చేస్తున్నాడని అది సంతోషిస్తుందా ? ఏమిటి నీ ఉద్దేశం. తరుచు పడిశెం పడుతూ ఉంటుంది అనికూడా వ్రాసేదా ?

మీ కెందుకు, నేను చెప్పినట్లు వ్రాయండి.

"తమ్ముడు గుమ్మాలు దాటుతున్నాడు."

తమ్ముడు గుమ్మాలు దాటటంకూడా వ్రాయులట డీ! కాంతంగారూ ? ఇంకా నాలుగు రోజులకు వీధిలోకి వెళ్ళుతాడు. ఆ తరువాత వాళ్ళ గుమ్మాలూ, వాళ్ళ గుమ్మాలు కూడా దాటుతాడు.

"మా చిట్టిబాబు గోపాలకృష్ణుడండీ, మా తండ్రి గడపలు దాటాడు. ఇవ్వాళ గారెలు వండుతున్నాను. మీరు మధ్యాహ్నం ఎక్కడికీ వెళ్ళకండేం ?" అంటూ కాంతం

రాధిగాడిని ఎత్తుకొని రొమ్ముకు అదుముకొని ముద్దాడింది. వాడు కిలా కిలా నవ్వుతూ, అక్క, అక్క అని చిలకలాగ పలికాడు. కాంతం నా వంక చూచింది. ఆమె హృదయంలో ఆనందం పొంగిపోతున్నది. ఆమె కళ్ళల్లో క్షీర సముద్రో ద్భూత తరంగ శిరోపరిభాగ స్థితఫేన పుంజవినిర్గత ధావళ్య రేఖలు తళతళ మెరిసినై. విన్నారా ? అన్నది.

'ఆ' అన్నాను నేను మామూలు గొంతుకతో. కాంతం నాలో ఆనందపు పొంగు లేకపోవటం చూచి, చాలా నిరుత్సాహపడి, చప్పరించి, "ఎందుకండీ మీరు పద్యాలు చదువుతారు." అని అడిగింది. నేను మాట్లాడక ఊరుకొనే సరికి ఆవిడ నిరసనగా అన్నది. "ఎందుకు కవిత్వం—పసి పిల్లల ముద్దుపలుకుల్లో ఉండే మాధుర్యం గ్రహించలేనివారు కవిత్వం చదివి ఏమి ఆనందిస్తారండీ ?"

ఈ మాటలు నేను విని కాస్త ఆలోచనలోకి దిగాను. నిజమే ఆ మాట. అప్పుడు నాకు తెలిసింది కవులు కోవిల కూజితాన్ని ఎందుకు మధురమైంది అన్నారో, రాధిగాడు అక్కపైన ఒక రసవంతమైన పద్యం చెప్పినట్లు నాకు తెలిసి ఆనందాన్ని పొంది, తల్లి చంక నెక్కి కూర్చున్న వాడి లేత బుగ్గలను ముద్దెట్టుకొన్నాను. ఇంకా ఆవిడ కొడుకును ముద్దా డుతునే ఉంది. అందుకని ఇంకా ఏమి వ్రాయమంటావో చెప్పు అని అడిగాను.

'అక్క, అక్క అని అంటున్నాడు.'

అని వ్రాయమంటావా ?

వ్రాయండి.

వ్రాశాను. ఆవిడ చెప్పినట్లే వ్రాశాను. ఆవిడ విని ఏమిటండీ పొడిముక్కలు వ్రాస్తారూ? అన్నీ విడదీసి చెప్పాలె. కాస్త అందిస్తే అల్లుకుపోలేరు. తమ్ముడు నీకోసం బెంగపెట్టు కొన్నాడు. కార్తిక పౌర్ణిమినాటికీ రమ్మని వ్రాయండి.— ఇక్కడ నుంచుని మీకు చెపుతూ ఉంటానికి నాకు తీరిక లేదు. ఇల్లాని ఆవిడగారు లోనికి వెళ్ళిపోయింది. వెళ్ళి పోతూ పోతూ గబగబ గీకెయ్యక, చక్కగా అన్ని సంగతులు వ్రాయండి అని గట్టిగా చెప్పి వెళ్ళింది.

బాగా వ్రాయటం అంటే ఏమిటి ? వర్ణాలనుచేర్చి వ్రాయటం కాదాయె! పెద్దపెద్ద మాటలువేసి వ్రాయటమూ కాదు. శబ్దాలంకారాలు వాడటమూ కాదు, ఇంక బాగా వ్రాయటం ఏమిటిఅర్థంలేని మాట అనుకొని ఇట్లా వ్రాశాను.

తమ్ముడు అక్క అక్క అంటున్నాడు. రెండక్షరాల మాటలు వస్తున్నాయి !

ఆ వాక్యం వ్రాసి ఇక్కడ కొంచెం బాగా వ్రాద్దామా అనిపించింది. అంటే వాడు నేర్చినమాటలన్నీ వ్రాయటమా? లేక వాడి భాషాజ్ఞానాభివృద్ధిని గురించి ఒక చిన్న వ్యాసము వ్రాయటమా ! నిజానికి ముందుముందు వాడు భాషను అంతా పాడుచేస్తున్నాడు. పదాలను వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయాలతో వాడుతాడు. రాయికి బహువచనంగా

రాయిలు వాడుతాడు. వాళ్ళ అన్నయ్య అట్లాగే చేసినాడు. ఇల్లాంటి పనినిగూర్చి నేను ఏమంత మెచ్చుకోనేది.

అందుకని ఆ ప్రయత్నం మాని. "కార్తిక పౌర్ణమికి రావలసినది. సముద్ర స్నానానికి వెళ్ళవచ్చు" అని వ్రాసి కాంతాన్ని పిలిచాను ఉత్తరం పూర్తి అయింది వి దుగానిరా అని.

ఆవిడ వచ్చి ఉత్తరం పూర్తిగా విని నోరు నొక్కు-కొని నా బొంద మిమ్మును రాయమంటే, అంతే! కాయితం అట్లాగే ఉంది! ఏమి వ్రాయటం అది! అని విసుకొన్నది.

చెప్పు వ్రాస్తానని నేను మళ్ళీ అన్నాను.

వ్రాయండి "పెద్ద అక్కయ్యా, దాని మొగుడూ హైదరాబాద్‌లో ఉన్నారు. దానికి వంట్లో ఏదో, ఇదిగా ఉంది. గట్టిగా చెప్పలేము."

నాకేమి అర్థం కాలేదు. ఏమిటి ఈ భాష! ఇదిగా ఉండటం ఏమిటి!—గట్టిగా చెప్పలేకపోవటం ఏమిటి!— అని నేను అడిగాను. ఆవిడ నవ్వి మీకు తెలియకపోతే మానె. దానికి తెలుస్తుంది లెండి వ్రాయండి. "శాస్త్రి, రాధా విజయుడూ అంతా కులాసాగా ఉన్నారు. తెనాలిలోనూ, గుంటూరులోనూ మన వాళ్ళ అందరి క్షేమం వ్రాయించవలెను."

వ్రాశాను. అక్కడికి ఒక విధంగా ఉత్తరం పూర్తి అయినట్లే తోచింది. "అయినట్లే కదూ ?"

ఈ ప్రశ్న విని ఆవిడ ఆశ్చర్యపోతూ, మీకింతమాత్రం తెలియదేమండీ, మీకు తోస్తుందేమోనని నేనూ ఇందాకటి నుంచి కనిపెట్టిచూస్తున్నా మీ బుర్రలో తట్టందే ?

నిజానికి ఇంకా ఏమి వ్రాయాలో నాకు తెలియలేదు. ఆలోచించినా తోచలేదు. 'ఉహు ఇంకా ఏమి వ్రాయాలో నాకు తోచటంలేదు ?'

శాంతం నా తలపై చెయ్యివేసి మునివేళ్ళతో రెండు సార్లు కొట్టి—ముఖ్యమైన విషయమండీ ! అన్నది.

"ఉహుం. లాభంలేదు"—అన్నాను.

ఆవిడ నా తలపైన వలయాకారంగా తనచేతిని త్రిప్పి మృదువుగా నొక్కి "అల్లుడుమాట ఏదండీ ఈ ఉత్తరంలో" అన్నది. "అమ్మాయికి వ్రాసే ఉత్తరంలో అల్లుడి సంగతి ఏముంటుంది ?" నా బొందా మీకు చెప్పినా తెలియకపోతే. మొగుడుమాట లేకపోతే పిల్లమనస్సు కష్టపెట్టుకోదూ. అల్లుణ్ణి గురించి కూడా ఒక్కముక్క వ్రాయండి.

కొంతసేపు ఆలోచించిన మీదట ఆ మాట నిజమే అని తోచింది. ఏమి వ్రాద్దామా అన్న ఆలోచనలో కలం చివరభాగం సగం నమిలి చివరకు—మా అల్లుడు కులాసాగా ఉన్నట్లు వ్రాయవలసినది. అని వ్రాశాను. చదివి వినిపించాను. కాని వినిపించుకొన్నట్లు లేదు. తరువాత సంగతి చెప్పమన్నట్లు చూశాను.

ఆవిడ ఇల్లాగ అన్నది. "వాళ్ళ శాంతకు పెండ్లి అయింది కదండీ. పెద్దమనిషి అయిందా" అని వ్రాయండి.

మనకెందుకే ఆ విషయం. అల్లుడు చెల్లెలు పెద్దమనిషి అయితే మనకేం, కాకపోతే మనకేం ?

అవ్వ, మీా కెందుకూ ఆగొడవ అంతా, వ్రాయండి.

ఆ ముక్క కూడా వ్రాశాను. ఉత్తరం మొదటినుంచీ చదివి వినిపించమంది. చదివి వినిపించాను. కాంతం ముక్కు అన్నది. "నా బొంద. ఒక ఉత్తరం వ్రాయమంటే, ఇంత అవకతవకలుగా వ్రాసి నన్నేడిపిస్తారా యె! ఎల్లాగ మిమ్మల్ను పెట్టుకొని కాపురం చెయ్యటం!"

ఆవిడ ఎందుకు విసుక్కుంటున్నదో నాకు అర్థంకాక నేను తెల్లపోయి చూశాను. నాకు విషయం స్పష్టంగా చెప్పంది తెలియదని గ్రహించి ఇల్లాగ అన్నది. "అమ్మా యిని రమ్మని వ్రాస్తిరిగదా, ఆయననుకూడా రమ్మని వ్రాసు కోరుటండీ. ఎన్నని నేను దగ్గరుండి చెప్పేది ?"

నాకు కొంచెం విసుగుగా ఉంది. ఆవిడమాటను నేను కాదనలేను. అల్లుణ్ణికూడా రమ్మని కోరుతున్నారు—అని మరో ముక్క వ్రాశాను.

ఈ తఫా కాంతం విసుగ్గుని—ఎబ్బె ఎన్ని చెప్పినా ఇంతే మీారు. అల్లా వ్రాయకూడదు కొట్టేసి, మీారు భార్యా భర్తలు ఇద్దరూ బయలుదేరి రావలసింది. అని వ్రాయండి,

నేను మాట్లాడకుండా వ్రాస్తున్నాను. ఆవిడ ఇల్లాగ చెప్పింది. "నీవూ, అల్లుడూ తప్పక రావలసినది. దశమినాడే బయలుదేరండి, నాలుగు రోజులు ముందుగా వస్తారు."

ఆయన ఆఫీసు ఉందాయె. సెలవలు లేవాయె. ఎట్లా వస్తాడో అన్నాను నేను.

అదంతా మనకెందుకండీ, రాదల్చుకొంటే సెలవుపెట్టి వస్తాడు. రాకపోయినా రమ్మన్నారని సంతోషిస్తాడు—అన్నది కాంతం.

అయిపోక ఏముంది లెండి. ఏమో వ్రాశామని అనుకోవద్దు తప్పక రావలెను అనండి.

పైన వ్రాసాంగా ?

వ్రాస్తే ఏం ? మళ్ళీ వ్రాయండి.

వ్రాశాయా : "మీ కోసం ఎదురుచూస్తూ ఉంటాము. తప్పక దశమినాడే రండి".

వ్రాశారా ? ఆ.

ఆ.

ఇంకా స్థలం ఉన్నట్లుందే ?

స్థలానికేం. స్థలం చాలా ఉంది.

"అయితే చూడండి, సూరమ్మ అత్తయ్యను, నాగమ్మ పిన్నినికూడా సముద్ర స్నానానికి తీసుకొని రావలసినది.

ముసలమ్మలు. వాళ్ళేం వస్తారే! ఊరికే వ్రాయుటమే కాని !

పాపం పెద్దవాళ్ళు. ఓపిక జేసుకొని వస్తే రంగడి ఉత్సవాలు చూస్తారు. లేకపోతే రమ్మన్నందుకు సంతోస్తుంది. నోరెత్తకుండా ఆవిడగారు చెప్పినట్లు వ్రాశాను. ఒక్కసారి చదవండి మొదటినుంచీ అన్నది. నాలుగోసారి చదివి వినిపించాను.

పూర్తి అయిందా!

అయినట్లేగాని ఆవూళ్ళో గోంగూర చౌక. నాలుగు వీసెలు గోంగూర, రెండు వీసెల పచ్చిమిరపకాయలు తెమ్మని వ్రాయండి.

నేను మాట్లాడ దల్చుకో లేదు. చెప్పినదల్లా వ్రాద్దామనుకొని వ్రాసాను. మళ్ళీ ఇంకొకసారి చదవమంది. చదివితే విన్నది. సంతోషించినట్లే కనపడి ఇల్లా అన్నది బాగానే వ్రాశారు. ఇక చాల్లెండి. స్థలం లేనట్లుందే ఉత్తర కొసలలో కొంచెం చోటుఉంది గాని అక్కడ వ్రాయండి. మీరు ఇద్దరూ తప్పక రావలసినది అని.

మళ్ళీనా ?

వ్రాయండి—అని బ్రతిమిలాడింది.

ఏదీ ఒక్కసారి వినిపించండి నేను వెళ్ళతాను అన్నది.

"చి॥ సౌ॥ మంగతల్లిని దీవించి వ్రాయునది. ఉభయ కుశలోపరి. ఇక్కడ అంతా క్షేమం. మీ క్షేమం వ్రాయించవలెను. నీవు వ్రాసిన ఉత్తరం అందినది. సంగతులు తెలిసినవి

చి॥ రాధిగాడు బాగా అల్లరిచేస్తున్నాడు. కంగాళంలో నీళ్ళు పారపోస్తున్నాడు. వాడు గుమ్మాలుకూడా దాటుతున్నాడు. గడపలు దాటినందుకు ఇవ్వాళ గారెలు వండుతాము. నాఅక్కా, అక్కా, అంటున్నాడు. నీకోసం బెంగపెట్టుకొన్నాడు.

నీవు కార్తిక పౌర్ణిమనాటికి ఈవూరు రావలసినది. సముద్రస్నానానికి రావలసినది. పెద్ద అక్కయ్యా, దాని మొగుడూ హైదరాబాద్‌లో ఉన్నారు. దానివంట్లోకొంచెం ఇదిగా ఉంద. గట్టిగా చెప్పలేము. చి॥ శాస్త్రి, రాధా, విజయులు అంతా కులాసాగాఉన్నారు. తెనాలిలోనూ, గుంటూరులోనూ మనవాళ్ళ అందరి క్షేమం వ్రాయించవలెను. మా అల్లుడు కులాసాగాఉన్నట్లు వ్రాయవలసినది. చి॥ సౌ॥ శాంత పెద్దమనిషి అయిందా, పౌర్ణమినాటికి అల్లుణ్ణికూడా రమ్మని కోరుతున్నాను. అంటే మీరు భార్యాభర్తలు ఇద్దరూ రావలసినది. నీవూ అల్లుడూ రావలసినది దశమినాడే బయలుదేరండి. నాలుగురోజులు ముందుగా రండి. ఏమో వ్రాశామని అనుకోవద్దు. తప్పక రండి. మీ కోసం ఎదురు చూస్తుంటాము. తప్పక దశమి నాటికే రండి. సూరమ్మ అత్తయ్యను నాగమ్మ పిన్నినికూడా సముద్రస్నానానికి తీసుకొని రావలసినది. వచ్చేటప్పుడు నాలుగువీసెల గోంగూర, రెండువీసెల పచ్చిమిరపకాయలు తేవలసినద. మీరు ఇద్దరూ తప్పక రండి.’

ఇట్లా ఉత్తరం పూర్తిగా వినిపించాను. కాంతం సంతోషించి పోస్టులో వేయటానికి పంపేముందు ఒక్క ముక్క వ్రాయమన్నది. అబ్బాయికి వాళ్ళ బావ ఒక కోతిని తెచ్చి ఇస్తానన్నాడట. ఆయన వచ్చేటప్పుడు తెమ్మని వ్రాయండి. నేను కొంటూ లేపోనీ అన్నాను. ఆయన తేకపోతే అల్లాగే కొనవచ్చు లెండి అన్నది ఆవిడ. ఆయన రాడేమో అసలు ? అన్నాను, కాంతం వెళ్ళిపోయింది అవతలకు.

నేనుమటుకు "అబ్బాయికి కోతికావాలట. నేను కొనేదా ? నీవు వచ్చేదాకా ఉండేదా," అని వ్రాసి ఉత్తరం పోస్టుకు పంపాను.

---

# పొడుగు డబ్బాతో ప్రత్యక్ష పాఠం

పంతులు చాలా భయస్థుడు. చదువు చెప్పటంలో కూడా గట్టివాడే. తనకు తెలిసిన విషయం చెప్పడంలో వళ్లు దాచుకోడు. పిల్లలను భయ భక్తులలో ఉంచగలడు. కాని ఆయనకు పరీక్షాధికారి అంటే భయము. ఆయన వచ్చి ఏమి లోపం కనిపెడతాడో ఏమి కొంప మునుగుతుందో నని హడలిపోతూ వుండేవాడు.

ఇన్‌స్పెక్టరు వస్తున్నాడని కబురు రాగానే వచ్చింది పంతులు జాగ్రఫీ పుస్తకం తీసి పాత పాఠాలన్నీ తిరగేశాడు. పిల్లలకు జాగ్రఫీ బొత్తిగా రాదు.

పంతులు ఊహించాడు. ఏమనీ అంటే, ఆయన జాగ్రఫీలో వెయ్యదగిన ప్రశ్న ఒకటే నని.

ఏమిటది ? భూమి ఎట్లాగుంది ?

ఈ ప్రశ్న ఆయన తప్పకుండా అడుగుతాడు. ఈ కుర్ర వెధవలు ఏం జెపుతారో ? గుండ్రంగా ఉన్నదీ అని చెప్పగలరా మరచిపోకుండా ! పంతులు బాగా ఆలోచించి చివరకు వాళ్లు చెప్పలేరనే నిశ్చయించుకొన్నాడు. అయితే ఒక్కటి. వారికేదైనా చూపించి గుండ్రంగా ఉందీ అన్న విషయం జ్ఞాపకం వచ్చేలాగున చేస్తే నయం అనుకొన్నాడు.

ఆయనకు రెండు పొడుండబ్బాలున్నవి. ఒకటి చదరంగాఉన్నది కానీ, రెండోది గుండ్రంగానే ఉంటుంది. అప్పుడాయనకు మంచి ఆలోచన వచ్చింది.

గుండ్రని పోడుండబ్బా పిల్లలకు చూపిస్తూ ఆయన ఇల్లా అన్నాడు పిల్లలతో. "ఒరేయ్ ఇన్‌స్పెక్టరువచ్చి భూమి ఎల్లాగవుంది అని అడుగుతాడు. ఇదిగో చూడండి ఇల్లాగ వుంది. దీనిని జ్ఞాపకం తెచ్చుకొని భూమి గుండ్రంగా ఉందని చెప్పండి."

పిల్లలముఖాలు వికసించినై. ఈ గంభీరమైన పరమ సత్యాన్ని జ్ఞాపకం తెచ్చుకొంటానికి ఒక చిన్న ఆధారం దొరికినందులకు కూడా వాళ్ళు చాలా సంతోషించారు.

కాసేపటికి టక్ టక్ మంటూ ఇన్‌స్పెక్టరు రానే వచ్చాడు. పంతులు తెల్లపోయినాడు. పిల్లలు మరీ గాబరా పడ్డారు.

వచ్చీ రావటంతోనే ఆయన కొంప అంతా మునిగి పోయినట్లు పిల్లలవంక భయంకరంగా చూస్తూ "భూమి ఎట్లా ఉం"దని అడిగాడు.

పిల్లలంతా హడిలిపోయినారు. ఒక్కరూ మాట్లాడ లేదు. ఒక్కరినోరూ పెగిలి మాటరాలేదు. మాస్టరే పాపం చివ్వరకు ఎల్లాగో తెప్పరిల్లి, వాళ్ళకు జ్ఞాపకం రావటానికి తన పోడుంకాయ చూపాడు, ఇన్‌స్పెక్టరకు కనుపించకుండా.

ఒక కుర్రవాడు రపీమని లేచి, 'మాస్టారూ నేను చెపుతా నండీ' అని కేక వేశాడు. ఇన్‌స్పెక్టరు సంతోషంగా వాడివంక చూచి చెప్పు అని ఉత్సాహ పరిచాడు. ఆ కుంక 'భూమి పోడుము బుర్రలాగుందండీ' అని కేక పెట్టాడు.

ఇన్స్పెక్టరు ఆశ్చర్యపడి, కుర్రవాడివైపు తిరిగి 'సరే బాగానే ఉంది, అయితే గుండ్రంగా ఉందా ? బల్లపరుపుగా ఉందా ?' అని స్పష్టమైన ప్రశ్న వేశాడు.

క్లాసు అంతా—మళ్ళీ నిశ్శబ్దంగా ఉంది ఒక్క క్షణం. ఇంతలో ఒక కుర్రవాడు చటుక్కున లేచి ఏకాదశినాడు గుండ్రంగానూ, మిగిలిన రోజులలో చదరంగానూ ఉంటుం దన్నాడు. ఆ పంతులు ఏకాదశినాడు, ఉపవాసముండి, మడికి పనికివచ్చే గుండ్రని నూరేడు కాయ ఉపయోగిస్తాడు. తక్కిన రోజులలో, విదేశీకర్రతో చేయబడ్డ చదరపు డబ్బీని ఉప యోగిస్తాడు.

---

# సాధింపు

"అమ్మాయీ కాంతం. బావ ఇంకా యింటికి రాలేదే ?"

"వస్తారు అన్నయ్యా వచ్చే వేళ అయింది వస్తారు ?"

"బావ తమాషా మనిషేనమ్మా."

"ఏమితమాషా అన్నయ్యా అదిగాదు అన్నయ్యా. నేను అనటం, ఏదో చిన్నతనంలో ఎల్లాగ ఉన్నా సరి పోయింది. పిల్లా జెల్లా ఉన్నవాళ్ళము కదా ఇప్పుడైనా కాస్త జాగ్రత్తగా ఉండవద్దూ, ఏమంటావు ?"

"ఉండొద్దమ్మా మరి! ఉండటం లేదా ?"

"ఏం ఉండటం ! ఆ పుస్తకాలన్నీ ఆయన కొన్నవే! .........ఎందుకు చెప్పు అన్నయ్యా అవన్నీ ?"

"ఎందు కేమిటి ? చదువుకొంటానికి. ఆ విషయంలో నీవు అడ్డు పెట్టకూడదమ్మా."

"నే నేమీ అడ్డు పెట్టటంలేదు. అన్నయ్యా, చదువుకో వద్దని ఎవరంటారూ ?"

"మరి ఏమిటే నీవు అనటం ?"

"ఉఁ ఆ పుస్తకాలన్నీ చదివినప్పుడు కాస్త జ్ఞానం రావాలే !"

"అవును. జ్ఞానానికి కాకపోతే ఎందుకూ ఆ పుస్త కాలూ ఇప్పుడు వాడు జ్ఞానంలేక ఏం జేస్తున్నాడంటావు ?"

"ఏం జెయ్యాలె అన్నయ్యా, ఆ ఏడు కాయేడు పైనబడ్డ కొద్దీ కాస్త తెలియాలె ఇది సంసారం, పిల్లలూ అన్న సంగతి."

"తెలియవద్దమ్మా మరీ! అయితే వాడికి ఆ తెలియ లేదంటావా?"

"ఆఁ తెలిస్తే ఏమైనట్లు!"

"ఏం జేస్తున్నాడమ్మా ఇంట్లోకి కావలసిన వస్తువులూ అవీ తీసుకురాకుండా ఏడిపిస్తున్నాడా?"

"అఁ హఁ అదేం లేదు అన్నయ్యా నెలకు కావలసిన వస్తువులన్నీ ఒకేసారి తెచ్చి పారేస్తాడు, ఏ హేమీ ఇబ్బంది లేదు"

"అయితే పిల్లలకూ నీకూ కావలసిన బట్టలూ, అవీ......"

"ఎబ్బెబ్బ కావలసినన్ని బట్టలు ఉన్నయి. పిల్లలకూ నాకూ కట్టుకునేందుకూ దాపుడుకూ కూడా ఉన్నయి!"

"సరే బాగనే ఉంది. అయితే ఏమిటి నీవు అనటం?"

"ఏమీ లేదు అన్నయ్యా, కాస్త వివేకం ఉండాలె అంటా. పెద్ద చదువులు చదివి ఏం లాభం?"

"వివేకం ఉండవలసిన మాట నిజమే—తప్పకుండా ఉండాలె. కాని ఏం జేస్తున్నా డంటావ్రా వివేకం లేకుండా?"

"నేను చెప్పేమాట ఒక్కటే అన్నయ్యా. కాస్త వెనకా ముందూ చూచుకోవాలె అంటా ఏమంటావ్."

తప్పకుండా చూచుకోవద్దూ మరీ! అయితే."

"మాటకు అడ్డొచ్చా—అదీ కాక నేను చెప్పేది ఒక్కటే అన్నయ్యా. ఇన్నిమాట లెందుకూ."

"ఏమిటమ్మా తల్లీ?"

"చెపుతున్నా ఇప్పుడూ-ఆయనని ఏమిటి, ఎవరైనా సరే.....ఊరికే గుడ్డి ఎద్దు చేలోపడ్డట్టు పోగూడదు. అవునా?"

"అవునూ! కాదని ఎవరంటారు?"

"అదీ సంగతి తెలిసిందా?"

"నాకేమీా తెలియలేదు!"

"నువ్వా ఇట్లాగ అంటావేం అన్నయ్యా. ఇప్పుడూ ......మన ఇబ్బందులు ఎల్లాటివో ఇతరులవీ అల్లాటివే అనుకోవాలా?"

"అవునమ్మా తప్పకుండా అనుకోవాలె. ఇంతకూ నీ కంప్లేంటు ఏమిటో నాకు కాస్త తెలిసే లాగున చెప్పు."

"ఆ కంప్లెంటూ నా బొందానూ! కంప్లెంటు కూడానూ నాకుతోడు! ఏంలేదు అన్నయ్యా. మన సంగతి ఏమిటీ,—మనస్థితి ఎట్లాంటిదీ...ఊ...మన పిల్లలూ మనమూ...... ఊ...ఏమంటావ్ అన్నీ చూసుకోవద్దూ?"

"తప్పకుండా చూచుకోవాలె. అవును గాని నీ దేదో గొడవగా ఉంది. వాడు చేస్తున్న అన్యాయం ఏమిటో నాకు స్పష్టంగా చెప్పు."

"పెద్ద అన్యాయం ఏముంది అన్నయ్యా. పాపం మాటలు ఎందుకు! ఆయన చేస్తున్న అన్యాయం ఏముంది అయినా!"

"అయితే ఏమంటావ్వా ?"

"ఏం లేదులే అన్నయ్యా, నీకుకూడా విసుగ్గా ఉంటే నేనేం జేసేది!"

"విసుకు కాదమ్మా పిచ్చి తల్లీ—నీవు ఏమంటావో తెలియటంలేదు."

"తెలిసేందు కేముందిలే...ఇపుడు నే ననటం ఆయన కైనా చిన్నతనం కాదు—దగ్గర దగ్గర ముప్పై ఏండ్లు ఉన్నాయి!"

"ఉంటే?"

"ఉంటేనా ? ఉంటే ఏముంది ! అయిదుగురు పిల్లల తండ్రి అయినారు!!"

"అయితే..."

"ఏమిటి అన్నయ్యా నీవుకూడా కాకపోయినా అట్లా మాట్లాడుతావ్వా ?"

"ఎట్లా మాట్లాడానమ్మా ? ఏంజేయమంటావ్ ?"

"ఏం జేస్తావా ? కాస్త ఆయనతో చెప్పు."

"ఏమని చెప్పమంటావ్ ?"

"ఈసారి! రెడ్డొచ్చె మొదలాడమన్నాడట!ఇందాకటి నుంచి చెపుతున్నదంతా పోయింది?"

"నాకు అసలు నీవు ఏమంటున్నావో, వాడిని ఏ విష యంలో కూక వేయమన్నావో తెలియందే!"

"ఇది మరీ బాగుంది. రామాయణం అంతా విని రాముడికి సీత ఏమౌతుంది అడిగ్గాట్ట!! అల్లాగ ఉందినీమాట!"

"నాకు తెలియవమ్మా నీ సాధింపులు. ఫలాని విష యంలో ఇల్లాగ వాడు కూడని పని చేస్తున్నాడు అని చెప్పు. నేను వాడిని అడుగుతాను. కూక వేస్తాను. ఇందాకటినుంచీ నీవు ఏమిటో అంటావు. నీ మనస్సులో సంగతి తెలియ దాయె."

"ఏముంది గాని అన్నయ్యా...అదుగో...మా బావ వస్తున్నారు...కాస్త చెప్పు...ఇల్లాగ కాదు 'అబ్బాయి. కాస్త జాగ్రత్తగా ఉండమనీ! గట్టిగా చెప్పు అన్నయా..."



# ఉపన్యాస ధోరణి

ఒక నలభై నిమిషాలు ఏదైనా ఒక్క విషయాన్ని గురించి మాట్లాడటం కష్టమైనపని. కొంతమందికి ఇది అలవాటు ఉంటుంది. అల్లాంటి వాళ్ళకు అదేమీ కష్టం అనిపించదు కాని, క్రొత్తవాళ్ళకు బాధే.

అసలు ఉపన్యాసం ప్రారంభించటంలో ఉంది అవస్థ అంతా. "నన్ను ఈ రోజున ఉపన్యాసం ఇయ్యటానికి మీరు పిలిచారు. ఇందుకు నేను ఎంతమాత్రం అర్హుడ్ని కాదు అల్పజ్ఞుడ్ని, చేతకానివాడిని, పనికిమాలిన వాడీని" అంటూ ప్రారంభిస్తారు కొందరు. నీసత్తా అంతంత మాత్రమేనని తెలిసికూడా ఎందుకు ఒప్పుకొన్నావయ్యా ఈపనికి? పిలిచారు కాబట్టి వచ్చాను అనటానికీ ఇదేమన్నా విందుభోజనమా? అని అనాలని అనిపిస్తుంది అల్లాంటిమాటలు వింటూ ఉంటే. ఇల్లా మనము అనుకొంటామని ఊహించి కొందరు "నేను సభారంజకంగా మాట్లాడలేనని తెలిసికూడా, నన్ను మీరు ఇక్కడికి రప్పించటం మీదేతప్పు" అని తప్పు అంతా మనమీదె పారేస్తారు గడుసు తనంగా.

ఇప్పుడు చెప్పిన రెండు పద్ధతులూకూడా శాస్త్ర అరితేరిన వాళ్ళధోరణే. బొత్తిగా క్రొత్తవాళ్ళకు ఇంతవరకు కూడా నడవదు. అధ్యక్షా అన్న దగ్గరే ఆగిపోతుంది.

వేదిక ఎక్కిన ప్రతి ఉపన్యాసకుడూ అధ్యక్షా అని ఒక కేక వేస్తాడు ముందు. అది ఎందుకూ అని ఒక ప్రశ్న.

అధ్యక్షుడు విస్తారం మాట్లాడడు. ఉపన్యాసకులు మాట్లాడేదంతా వింటూ ఉండాలె ఇష్టం ఉన్నా లేకపోయినా. కదలకుండా మెదలకుండా చాలాసేపు కూర్చోటం కష్టం. ఎంత గట్టి గుండె కలవాడికైనా కునికిపాట్లు రాకపోవు. కాస్త నిద్రమత్తులో పడతాడు. అందుకని ఉపన్యాస వేదికపై ఎక్కిన ప్రతివ్యక్తీ, అధ్యక్షా అని ఓ సుమారైన కేక వేయటంవల్ల ఆయన ఉలిక్కిపడి లేవటానికి చాలా అవకాశం ఉంది. దీర్ఘమైన ఉపన్యాసాలు విననూ లేకా, వెళ్ళిపోనూ లేక శ్రోతలు కూడా ఒకప్పుడు ఇదే అవస్థలో ఉంటారు. అందుకని "సోదర సోదరీమణులారా అని మరోచిన్న కేక వేయటం కూడా అవసరం అయింది ఈ రోజుల్లో.

ఆ కాస్త మాటా అన్న తరువాత ఇక ఉపన్యాసం ప్రారంభించాలె. క్రొత్తవాడికి అక్కడే ఉంది అవస్థ అంతా. నోట మాటరాదు. వచ్చినా తడబడుతుంది. నత్తివస్తుంది. ఒకమాట అనబోయి మరోమాట అంటాడు. ఒకాయన ఉపన్యాసం ప్రారంభించి "సామెతలు తెలుగు నుడికారానికి నిలయాలు" అని అనాలని అనుకొన్నాడు. మొదట్లోనే భయంతో వణికిపోయి తెలుగు నుడికారానికి అన్నాడు. సభ్యులు మర్యాద తెలిసినవాళ్ళు కాబట్టి, ఆతని అవస్థ గ్రహించి, ఆ వాక్యాన్ని చిరునవ్వుతో ఆహ్వానించారు. ఆయన మటుకు సభవంక చూడలేక పోయినాడు. సిగ్గుపడి చప్పున తప్పు దిద్దుకోవాలె నన్న ప్రయత్నంలో, తెలుగు

సుడిగాలానికి అనేశాడు చాలుకున్న రెండోసారి. అక్కడి వాళ్ళంతా కొద్ది కొద్దిగా ముసిముసి నవ్వులు నవ్వుకొన్నారు. ఆయనకు వచ్చిన చావైంది. క్రుంగిపోయినాడు. తల తిరుగుతున్నట్లు తోచింది. అప్పటికీ ధైర్యంచేసి, పెద్దగా గొంతెత్తి సామెతలు తెలుగు ఖారంపోడికి కిలయాలు అన్నాడు. శ్రోతలంతా ఇక ఆపుకోలేక గొల్లుమన్నారు

ఆరితేరిన వారికికూడా ఉపన్యాసా లివ్వటం అంత సులభమైన పనికాదు. మాట్లాడుతూ ఉంటే మధ్యలో, ఎవరో ఒకరు లేచి, ఏదో ఒక అడ్డుప్రశ్న వేస్తారు. దాంతో ఉపన్యాసధోరణి తెగిపోతుంది. మనిషి గాభరా పడతాడు. చాలాచికాకు కలుగుతుంది.

రెడ్డిగారు వచ్చిన సందర్భంలో మా వూళ్ళో ఒకసభ జరిగింది. శాస్త్రిగారు పోతన చిత్రాన్ని గురించి మాట్లాడుతూ నాగయ్యగారు ఆ పోతన పాత్రను ఒక విధంగా తగి ఉండలేదని చెప్పారు. ఎందుచేతా అంటే; పోతన పరమ భక్తుడు. భక్తుడు సాధారణంగా కృశించి ఉంటాడు. మేధాశక్తి ఆధ్యాత్మక బుద్ధీ పెరిగితే, దేహం క్షీణిస్తుంది అంటూ ఏదో చెప్పారు. దానికి రెడ్డిగారు సమాధానం చెప్పారు.

ఆధ్యాత్మికంగా వృద్ధి అయితే శారీరకంగా విధిగా నీరసించి ఉండనక్కరలేదు; అని మొదటి ఆయన వాదాన్ని, ఖండిస్తూఉన్న సమయంలో, నేనులేచి పెద్దగా అన్నాను. అల్లాగ కాదండీ, పోతన తప్పకుండా సన్నగా పల్చగా, రెప

రెపలాడుతూ ఉండి ఉంటాడు ఎంచేతా అంటే, ఆయన ఒక చోట లా వాక్యాంతయు లేదు అన్నాడు. అంతా నవ్వారు. రెడ్డిగారు చాలా చికాకు పడ్డారు. ఇల్లాంటి ఎగుడు దిగుడు మాటలు వచ్చినప్పుడు, తిప్పికొట్టి గొడ్డలి పెట్టులాంటి జవాబు చెప్పగలిగినవాళ్ళూ ఉన్నారు. కాని అల్లాంటి నిశితమైన మేధాశక్తి అందరికీ ఉండదు.

ఉపన్యాసకుడు ఒక్కొక్కప్పుడు, ఏదో విషయం జ్ఞాపకం రాక అధ్యక్షుణ్ని ఏదో ప్రశ్న వేస్తూ ఉండటంకూడా ఉంటుంది. ఒకసారి నేను నక్కలతోటలో ఉపన్యాసం ఇస్తున్నాను ఏదో సందర్భంలో నరకలోకం విషయమై ప్రశంస వచ్చింది. నరకానికి అధిపతి ఎవ్వరైంది జ్ఞాపకం రాక కాసేపు అవస్థపడి చివ్వరకు అధ్యక్షుణ్ని వైపు తిరిగి నరకానికి అధిపతి ఎవరండీ అని అడిగాను. అంతకుముందు నేను అన్న ఏదో ఒక మాటను పురస్కరించుకొని ఆయన నవ్వుతూ ఉండటం మూలాన వెంటనే జవాబు చెప్పలేదు. నేను జవాబుకోసం ఆయన ముఖం వంక చూస్తూ, నిరీక్షిస్తున్నాను. ఇంతలో సభలోనుంచి ఒకాయన "నగ్గయ్య" అని ఫెడేల్న కేక పెట్టాడు. ఇక అక్కడ ఉన్నవాళ్ళంతా విరగబడి నవ్వారు. నా ఉపన్యాసధోరణి తపీమని తెగిపోయింది. ఏమీ తోచ లేదు. అసలు నేను అక్కడ ఉపన్యాసం ఇస్తున్నాను అనే సంగతే మరిచిపోయి, మామూలు జీవితంలో క్లాసులో కుర్ర వాళ్ళు అల్లరిచేస్తే, విసుక్కునే పద్ధతిలో చికాకుపడి తప్పు

కూర్చో, నెట్స్, అని స్కూలు మాస్టరీ పద్ధతిలో అనేసరికి మళ్ళీ అంతా నవ్వారు. ఇక ఆ తరువాత ఉపన్యాసం ఎల్లాగ నడిచిందో నాకు జ్ఞాపకం లేదు.

మరోసారి నేను స్కూలులో క్లాసులో మాట్లాడుతూ కుర్రవాళ్ళకు సాహిత్యంయందు అభిరుచి కలిగేందుకు కొన్ని విషయాలు చెబుతున్నాను. కొందరి కవులపేర్లు చెప్పి, స్త్రీలుకూడా పూర్వకాలంలో కవిత్వం చెప్పేవాళ్ళు అని, అప్పటిదాకా ఎందుకు, ఇప్పుడూ ఉన్నారు ఆడవాళ్ళల్లో కవిత్వం చెప్పగలవాళ్ళు అని కూడా చెప్పి ఆధునిక కవయిత్రి అయిన ఒక్క ఆమె పేరు చెప్పండి మీలో ఎవరైనా అన్నాను. ఎవ్వరూ మాట్లాడలేదు. ఒక కుర్రవాడు మటుకు ధైర్యంగా లేచి నుంచుని కన్నాంబ—అండీ అని కేక పెట్టాడు. కొన్ని సమయాలలో ఉపన్యాసకుడు సభ్యులలో ఒకరిని ఏడిపించబోయి తానే గాఢమైన దెబ్బ తింటూ ఉంటాడు ఒకాయన ఎన్నికల సందర్భంలో ఒక గంభీరమైన ఉపన్యాసం ఇస్తున్నాడు. ఆయన తన పార్టీనిగురించి లేనిపోని గొప్పతనం తెచ్చిపెట్టుకొని మాట్లాడటం జూచి, ఒకాయన అసహ్యించుకొని ఉపన్యాసకుడిపై తిరగబడి ఏవో అడ్డదిడ్డు ప్రశ్నలు వేయటం సాగించాడు. ఇదేమీ అనుకొన్న ఇంకోవ్యక్తి, ఆ ప్రశ్నలు వేస్తున్న ఆయనతో, ఏమిటా వెధవప్రశ్నలూ నీవూనూ? గాడిదలాగున్నావు! ఇంతమాత్రం జ్ఞానం లేదేం అని కోప్పడ్డాడు. దానిమీద కొద్దిగా గల్లంతు బయలుదేరింది—

ఈయన, ఆయన్ను గాడిద అనటం బాగుండలేదని కొందరూ, ఆయన అల్లాగ ఎగుడుదిగుడు ప్రశ్నలు వేయటం అసలే బాగుండలేదని మరి కొందరూ అన్నారు. మొత్తంమీద వాళ్ళ ఇద్దరి పోట్లాటా సాగుతూనేఉంది. నీవు గాడిదవంటే, నీవు గాడిదవని తిట్టుకొంటున్నారు. ఒక మూలగా కూర్చుని ఉన్న ఒక ముసలాయన ఇదంతా చూచి, చికాకు పడి, చాల్లే బాగానే ఉంది. ఇహ ఊరుకోండి. మీ రిద్దరూ గాడిదలే అన్నాడు. అప్పటికీ ఇంకా గొడవగానే ఉండటంచూచి, ఈ గొడవ చేస్తున్న వాళ్ళందరిమీదా, ఒక్క విసురు విసురుదామని పెద్ద గొంతుకతో—ఇక్కడ చాలా గొడవగాఉంది. ఒక్కొక్కడే మాట్లాడితే శాస్త్రనయం. ఉన్న గాడిదలన్నీ ఒక్కసారే అరిస్తే చాలాచికాగ్గా ఉంటుంది అన్నాడు. "అయితే ముందు మీరు కానీయండి" అన్నాడు వేదికకు దగ్గరలోకూర్చున్న ఒకయువకుడు. అంతటితో ఆ సభ ఆగిపోయింది.

# పాఠం

పూర్వకాలంలో పాఠం చెప్పటం అంటే పుస్తకం తెరవటం, పాఠం చదవటం, అవశ్యంగా చెప్పేయటం ఏవో అర్థాలూ తాత్పర్యాలూనూ! అదేమంత కష్టమైన పనికాదు!

ఈరోజుల్లో నవీన పద్ధతుల ననుసరించి పాఠం చెప్పటం ఒక కళాసృష్టి. నేర్పుతో కూడినపని ఇది.

కాఫీని గురించిన పాఠం చెప్పవలసివస్తే కాఫీ పొడుము, అది తయారయ్యే విధమూ, దాని రంగూ, రుచీ, ఈ విషయాలను గురించి పాఠం చెప్పాలె.

కాఫీని గురించి కుర్రవాడికి అదివరకే కాస్తో, కూస్తో తెలిసి ఉంటుంది.

కాఫీ అనే మాట కుర్రవాడు ఇదివరకే వినివుంటాడు. దాని రంగును రుచినిగురించి కొన్ని విషయాలు వాడిబుర్రలో దాక్కొని ఉండవచ్చు.

బడి పంతులు ఏమిచెయ్యాలా అంటే ముందు, కాఫీ అనే అయిడియా వాడిమనస్సుకు తట్టేలాగున చెయ్యాలె. ఆ భావం కుర్రవాడి మనస్సులో అడుగున ఎక్కడో పడిఉంటుంది. ఎల్లాగో గాలంవేసి ప్రశ్నల మూలాన్నే దాన్ని పైకి లాగాలె.

కాఫీ అనే భావం బైట పడ్డా అది మరికొన్ని ఇతర భావాలతో కూడా బైటికివస్తుంది. నీటి అడుగునుంచి దేవి, ఒక ముత్యపుచిప్పను పైకి తీస్తే దాంతోపాటు ఏవో నాచు నత్తగుల్లలు, ఆవస్తువును పెనవేసుకొనిఉన్నవికూడా వస్తవి. వాటి సాంగత్యాన్నుంచి ముత్యపుచిప్పను తొలగించి ముత్యాన్ని గ్రహిస్తాము.

అల్లాగ, కుర్రవాడి మనస్సులోనుంచి కాఫీ అనే భావాన్ని పైకి లాగినపుడు. ఆభావం టీ. కోకో మొదలైన వాటికి సంబంధించిన విషయాలతో పెనవేసుకొని ఉంటుంది, అందుకని నేర్పుగల ఉపాధ్యాయుడు ఏమిచేస్తాడూ అంటే, రగు ఉచి మొదలైన సాక్ష్య ప్రమాణాలచేత వాడి మనస్సులో, కాఫీతోపాటు లుంగచుట్టుకొని ఉన్న ఇతరభావాలను, వేటికి అవి ప్రత్యేకంగా విడదీసి, కాఫీకి గల ప్రత్యేక లక్షణాలను చెప్పి కాఫీయొక్క స్వరూపతత్వం నిర్ణయం చేస్తాడు.

అపుడు, కాఫీ యొక్క సత్య స్వరూపం, నాచు,నీను, డిప్ప మొదలైన బాహ్యదేహాలనుండి విడివడిన ముత్యంలాగ, మాయనుండి విముక్తిపొందిన ఆత్మలాగ, వాడిలో ప్రకాశిస్తుంది.

అనుభవంగల ఉపాధ్యాయుడు, కుర్రవాళ్ళతో ఇవ్వాళ మీకు కాఫీని గురించి పాఠంచెబుతాను అని అనడు. అనకూడదు.

ప్రశ్నలు వేయాలె. ఆ ప్రశ్నలకు జబాబుగా కుర్రవాడి నోటివెంట కాఫీ అని రావాలె. వెంటనే టీచరు, ఆ మాటను పట్టుకొని బోర్డుమీద వ్రాసి కుర్రవాడికి చెప్పాలె అదుగో ఆకాఫీని గురించే మీకు పాఠం చెబుతానురో అబ్బాయీ అని.

అయితే ఆమాట ఆ కుర్రవాడి నోటివెంట దానంతట అది రావాలేగాని టీచరు నందియ్యకూడదు. కుర్రవాడి

మేధాశక్తిని, భావనాశక్తిని, సూచనతో పోషించి అట్లు పోషించి వాడికి ఆమాట తోచేలాగున చెయ్యాలి.

అది ఎట్లాగూ అనవచ్చు. "నీవు ప్రొద్దునే ఏమి తాగుతావు?" అని అడిగితే, కుర్రవాడు "కాఫీ అంటాడు— ఇల్లాగ కాఫీ అనేమాట వాడిచేత అనిపించాము. అప్పుడు కాఫీని గురించి వాడికి ఇదివరకే తెలిసిఉన్న విషయాలను చెప్పగల ప్రశ్నలచే రాబట్టి ఆ తరువాత ఎక్కువ విజ్ఞానాన్ని ఇవ్వవలసి ఉంటుంది. అదీ అసలు పద్ధతి.

కాఫీ అని ముందు కుర్రవాడిచేత అనిపించటానికి అనేక రకాల ప్రశ్నలు వేయవచ్చు. టీచరుయొక్క తెలివి తేటలను బట్టి ప్రశ్నలు వేయబడుతూ ఉంటై.

ఆరోజున పరీక్షాధికారి ముందు, నా నేర్పునంతా వినియోగించి, పాఠం చెప్పాలని సంకల్పించుకొని క్లాసును ఈ ప్రశ్న అడిగాను. "నీవు ప్రొద్దునే ఏమి తాగుతావు?" ఇల్లా అడిగి ఇన్‌స్పెక్టరు వంక చూచి నవ్వాను. ఆ నవ్వులో కొంత అర్థం ఉంది. ఆ అర్థాన్ని ఆయన కూడా గ్రహించి, తిరిగినవ్వి, తలఊపాడు.

ఒక కుర్రవాడు లేచి, "ఏమీ తాగనండి" అన్నాడు—పక్కవాణ్ణి అడిగాను. వాడు "నేను చద్దెన్నం తింటానండి" అన్నాడు.

ఏమిట్రా ఇల్లాగ జబాబులు ఇస్తున్నారూ అనుకొని, ఈ ఇద్దరూ బీదకుటుంబాలకు చెందినవాళ్ళు అయిఉంటారని నిశ్చయించి, వెనక బెంచీలో సిల్కుపర్టు తొడుక్కొని తళతళలాడే బంగారపు గుండీలు పెట్టుకొన్న కుర్రవాడి వేపు వేలు

చూపాను. ఆ అబ్బాయి లేచి వినయంగానే జవాబు చెప్పాడు. "నేను ప్రొద్దునే ఒకగ్లాసు పాలు తాగుతానండీ" అని. వాడిప్రక్కనున్న కుర్రవాడు నేను అడక్కుండానే చెప్పాడు "నేను జావతాగుతానండీ" అని ఒకడు అడక్కుండా ఎప్పుడు చెప్పాడో, అప్పుడు మిలిగిన వాళ్ళల్లో ఒకడు నేను కోకో పుచ్చుకొంటానని. ఇంకొకడు మాఅమ్మ నాకు ఓవల్ టిన్ ఇస్తుందండీ అని గబగబ అనేశారు. కానీ ఒక్కడినోటి వెంట అయినా కాఫీ అనేమాట రాలేదు.

ఇంకా నాకు ఆశపోలేదు. ఎవరైనా నేను ఆశించిన జవాబు చెప్పకపోతారా అని. అందుకని "ఇంకేమైనా తాగ వచ్చా?" అని మళ్ళీ అడిగాను మిగిలిన కుర్రవాళ్ళల్లో ఒక డిని. వాడు కొంచెము ఆలోచించి "గంజితాగవచ్చునండీ" అన్నాడు. అప్పటికి నిరుత్సాహపడక మరో కుర్రవాడి వంక వేలుచూపాను. వాడు అట్టేసేపు ఆలోచింపకుండానే "తర వాణి తాగుతారండి కొందరు" అనేశాడు.

ఇన్ స్పెక్టరు చాలా జాగ్రత్తగా, ఉత్సాహంతో చూస్తున్నాడు. నా కృషికి ఎల్లాంటి ఫలితం వస్తుందోనని నేను అవలంబించినపద్ధతి సరియైనదేనని ఆయనకు తెలుసు కాబట్టి ఆయన ఏమీ మాట్లాడక ఊరుకొన్నాడు.

ప్రొద్దున్న ఏమితాగుతారూ అన్న ప్రశ్నవల్ల, కాఫీ అనేమాట రాబట్టలేకపోయినాను. కాని అప్పటికీ నేనునిరు త్సాహపడలేదు. ఇంకోరకంప్రశ్నవల్లసాధిద్దామనుకొన్నాను.

"హోటల్లో ఏమి అమ్ముతారూ?" అన్న ప్రశ్న వేస్తే "కాఫీ" అని అనక ఏంజేస్తాడూ కుర్రవాడు!! సరే. అడిగి

సమాధానమని ఆ ప్రశ్న వేశాను. లడ్డూ అని ఒకరూ, మైసూరు పాకం అని ఒకరూ, చెప్పారు. వడ, కారంపూస, జాంగ్రి, పకోడీ, అని ఏవేవో చెప్పారు. కాని కాఫీ అన్నమాట ఒక్కడి నోటివెంటా రాలేదు.

ప్రాణం విసిగింది. 'ఏ హోటల్ లోనరా, ఇవన్నీ అమ్మేది?' అని అడిగితేనైనా చెప్తారా, కాఫీ హోటల్ లో నని, ఆశపడి, చివరకు ఆ ప్రశ్న కూడా అడిగాను.

శంకరయ్యా హోటల్లోనండి, మంజప్ప హోటల్లో నండి, సుబ్బయ్యా హోటల్లోనండి, అని రకరకాల జవాబులు వచ్చినవిగాని ఒక్కడూ నోరు జారిఅయినా అనలేదు కాఫీ హోటల్ అని.

కుర్రవాళ్ళంతా మాస్టరును తిప్పలు పెడదామని కట్టుగట్టి, ఒక్క మాటమీద ఉన్నారా అని తోచింది. ఇన్ స్పెక్టరు కూడా నవ్వుకొంటున్నాడు. నేను అవలంబించిన మెథడ్ ఫెయిల్ అయితే నా అసమర్థతవల్ల ఫెయిల్ అయింది అంటారు గాని మెథడ్ లో లోప ఉందని ఎవ్వరూ అనరు. ఏదో చెయ్యాలె, కావలసినజవాబు రాబట్టాలె.

క్లాసువంక చూశాను, చిన్నవయస్సులో ఉండి, మాస్టరు అంటే భయం ఇంకా వదలని అమాయకుడైన కుర్రవాడు ఎవరైనా కనపడతాడని ఆశతో. నా అదృష్టవశాత్తు ఒకడు వెనక బెంచీలో కూర్చున్నాడు.

వాడిని పట్టుకోవలెనని నిశ్చయించుకొన్నాను. లడ్డూ మొదలైన వస్తువులు అమ్మేచోటును ఏమంటారు? నీవు చెప్పు? అని అడిగాను. ఇన్ స్పెక్టరు చూడకుండా, వాణ్ణి ఉరిమిచూస్తూ,

నాకంటివిరుపుచూచి వాడు కాస్తభయపడక పోలేదు. బిక్కముఖంకూడా పెట్టాడు. ఆ హోడల్‌లో వాడు కాఫీహోటల్ అండీ అని అంటాడనుకొన్నాను. అనాలిసిందే కాని, వాడికి తోచలేదో ఏమో కర్మం, చటుక్కున మిఠాయి కొట్టండి అని ఊరుకున్నాడు.

"అది సరే. బాగానేఉంది. అల్లాంటి వస్తువులుఇంకా ఎక్కడఅమ్ముతారు? చెప్పు" అని భయంకరంగా గర్జించాను.

ఎట్లాగయినా కుఱ్ఱవాడు భయపడిపోయి, ఏమీ మాట్లాడకుండా నుంచున్నాడు. ఆస్థితి నేను గ్రహించగలగటంవల్ల బ్రతికిపోయినాను. గ్రహించి వాడిదగ్గరకువెళ్ళి, వాడిభయం తీరేటట్లు వీపుమీద గట్టిగా చఱచి 'భయంలేదు. చెప్పు' అన్నాను.

వాడు అప్పటికీ మాట్లాడలేదు. కుఱ్ఱవాళ్ళంతా కలిసి అనుకొన్నారో ఏమో. ఒక్క మాటమీద ఉండాలనీ, ఏమైనాసరే చెప్పకూడదనీ! అంతే అయిఉంటుంది.

పాఠం పాడై పోయేటట్లుంది. పోతుందికూడా, వాడైనా చెప్పకపోతే నాకు కావలసిన జబాబు. వాడికి జబాబు తెలుసు. కాని చెప్పకపోవటానికి కారణం పెంకెతనం. అది కాస్త వదలకొట్టాలె. ఇన్‌స్పెక్టరుముందు చెయ్యిచేసుకోంటానికి వీలులేదు.

నేను వాడిదగ్గరకువెళ్ళి పళ్ళు బిగబట్టి ఉరిమిచూచి, భయపెట్టి 'చెప్పు, లేకపోతే చంపేస్తాను' అన్నట్లుచూశాను.